time that we should think of these things also and bring in a comprehensive legislation to put all matters right to make all people satisfied, to see that there is no inequitable treatment of individual as against individual When such a thing comes in, we shall be fully achieving our object and we may bring in socialistic attitude to life, to an economy and to other things in society

Thank you, Sir

మిస్టర్ డెప్యూటీ స్పీకర్:—ఇంకా చాలా మంది సభ్యులు మాట్లాడవలసి వున్నది. అందువలన time fix చేయడం అవసరమనుకుంటున్నాను. ప్రతి ఒక్క సభ్యునికి 10 నిమిషాలకాలం ఇవ్వబడుతుంది. అంతకంటే ఎక్కువ కావలయునంటే వారి ఉపన్యాసాన్నిబట్టి 5 నిమిషాల వరకు మరల పొడిగించబడుతుంది. 8 నిమిషాలు అయిన తరువాత first bell మ్రోగుతుంది. అప్పుడు వారికి ఇంకా time కావలసినదీ లేనిదీ తెలిపితే extend చేయబడుతుంది. రెండవ బెల్కు సభ్యులు కూర్చొనవలెను ఇందుకు సభ్యులు సహకరించవలసిందిగా కోరుతున్నాను.

*Sri K V. Vema Reddi (Kadiri)* — Mr. Speaker Sir, in supporting the Bill, I wish to make a few observations, but I do not want to go into the details of this Bill. This legislation which was long cherished by the people and which is now introduced by the hon Minister for Revenue marks a new era of social order which aims at the reduction of inequalities to a little extent in the landed properties But as a matter of fact, the Planning Commission only contemplated the land legislation, since a long time. Sri Kala Venkata Rao while introducing the Bill referred to the various legislations in different States, in different countries and also referred to the Committees constituted by the composite State of Madras viz, the Subramaniam Committee and also to the Committee constituted by the Andhra Government viz, Lakkaraju Subbarao Committee. All these legislations no doubt aimed at reducing the disparities of landed properties This Bill provides a ceiling on the land on the basis of net income The net income according to this Bill is 50 per cent of the gross income and the Bill also provides for permissive holdings Permissive holdings is determined by taking into consideration the average prices of the crops during the period of 10 years This is a Bill which involves several complications and as referred to by the hon. Minister for Revenue such Bills were passed by several States, but they

were not implemented. True Sir, it involves several complications giving rise to several questions of law and fact as referred to by Sri Lakshminarasimham Dora, with reference to the ceiling of the land, the reference to the permissive holdings and also the compensation and the joint family system which breaks up often. This Bill in the above context needs a careful scrutiny and the Bill itself is not very exhaustive and the Select Committee has to be very careful to go into the details of this Bill with minor scrutiny. This Bill, as I have already submitted, marks a new era. Agriculturists no doubt welcome the Bill, but the life of an agriculturist to-day presents a gloomy picture. He is a victim to the vicissitudes of seasonal conditions. Always Nature frowns at him and to-day he is denied the amenities of higher education, better medical facilities as commanded by the people in the urban areas. To-day he welcomes this Bill but he does so with a sense of disappointment. He welcomes this Bill when it synchronises with the ceiling on the incomes of properties owned by the people who reside in the urban areas. To-day, the higher education is denied to him, and he is groaning under heavy taxation. The incidence of taxation is very heavy, and what about the urban areas? The Planning Commission if it really intends to change the economic and social structure of this country should bring about a legislation for fixing the ceiling on the incomes in the urban areas and on the incomes of the professionalists like the lawyers and putting a ceiling on the properties other than the lands like buildings owned by the urbanites in big cities and towns. That will create a good atmosphere. Otherwise, there will be a lot of discontentment because the agriculturist is the backbone of this country To-day the teeming millions are fed by the agriculturist, by his sweat and labour and if the ceiling on the land is alone contemplated without bringing a legislation of fixing the ceiling on incomes on properties in urban areas, this will lead to a great catastrophe and it will endanger democracy. My friends referred to the agricultural labour. As a matter of fact, the condition of agricultural labour should be improved. As a matter of fact, they have no hunger for land. Hunger for land is only a political slogan. They want food and decent living and their conditions can only be improved by diverting them to the other professions. To-day there is much pressure upon the land and our agricultural economy cannot be developed and improved by the division of land, by further fragmentation of land, because further fragmentation of land

will affect production and our object of increasing production will be crippled in the bud So my submission to the hon Minister for Revenue is that he should also consider and provide for the well-being of the agricultural labour. To-day the well-being of the agricultural labour is co-existent with the agriculturist. As a matter of fact, the conditions of the people should be improved I know Sir, the Government recently distributed the banjar lands to several landless poor at the rate of 5 or 6 acres, but that did not solve the problem As a matter of fact, they have not taken seriously for cultivation. Several lands have not yet been brought under cultivation That is no way of improving the conditions of the landless poor, but their conditions can be improved by development of the side industries The cottage industries can be developed, and, as a matter of fact, as observed by some of the hon Members, they will be without work—agriculturist as well as agricultural labour—for 6 to 7 months in a year. They should be provided with some work and that can be done done only by providing and by encouraging cottage industries in the villages and by diverting them to other professions as in Japan and other countries. Thank you, Sir.

శ్రీ రంగారెడ్డి (వాల్కొండ):—అధ్యక్షా, రెవిన్యూమంత్రిగారు ప్రవేశ పెట్టిన బిల్లును ఆమోదిస్తూ కొన్ని విషయాలు చెప్పదలచుకున్నాను.

వ్యవసాయదారుని యొక్క జీవన ప్రమాణాన్ని పెంచవలయునన్నదే భూసంస్కరణల యొక్క ప్రధానోద్దేశం. దీనికి సంబంధించిన [illegible] చాలా విషయాలు నిన్న చెప్పారు.

ఒక్క భూమి యివ్వడం వలననే రైతుయొక్క సమస్యలన్నీ పరిష్కారం కావు. ముఖ్యంగా ఉత్పత్తికి అసలు పేదరికం అడ్డువస్తున్నది. ఎరువులు, నీటి వసతులు, యితర వ్యవసాయ పరికరాలు సరఫరా చేయందే రైతు ఆర్థిక పరిస్థితి బాగుపడదు. ఈ విషయాన్ని మనం గమనించకపోయినట్లయితే యీ బిల్లు ప్రవేశపెట్టడం నిష్ప్రయోజనమూ, నిరర్థకమే అవుతుంది. 7, 8 సంవత్సరాల క్రితం హైదరాబాదులో Pl nning Commission వారిసూచన ప్రకారం భూసంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. అయితే అందులో ఒక విధానం. యీనాటి సంస్కరణలలో మరొక విధానం అవలంబించడం వలన రైతులలో యీ సంస్కరణలపట్ల అవిశ్వాసం ప్రబలడానికి అవకాశముంది. అటువంటి అవిశ్వాసం రైతులలో ప్రబలకుండుటకుగాను ప్రభుత్వం ఆధునిక పరికరాలను, ఎరువులను, యితర సదుపాయాలను

వారికి ఏర్పించవలసి యున్నది ఈనాడు చాలామంది తెలంగాణాలో—తోటలు వేశారు. వారుకూడా నిరుత్సాహపడకుండా చూడవలసి యున్నది. ఏవిధాన్నానైనా ఖచ్చితంగా అమలుచేసి యిక దానిలో కొంతకాలంవరకైనా మార్పురాదు అనే విశ్వాసాన్ని రైతులలో కల్గించాలి. ఇలాంటి మార్పులు తెచ్చుకున్నందుకు పల్లెటూరి ప్రజానీకం ఒకప్రక్క సంతోషపడుతున్నా, మరోప్రక్క ప్రభుత్వం పట్టణపౌరులతోపాటు తమకు సమస్తసౌకర్యాలను కలిగించకపోగా అన్ని అత్యాచారాలకు గురిచేస్తున్నారని విచారిస్తున్నాను

(Mr Speaker in the chair)

పల్లెటూరివారికి ఒక ఆస్పత్రినో, ఒక స్కూలునో కట్టించమంటే వారు contribution చేయనిదే సాధ్యం కాదంటారు. పల్లెలలోని ప్రజలు కష్టపడుతుండగా పట్టణాలలోని పౌరులు సుఖమనుభవిస్తున్నారు. కనుక వారిపై కొన్ని అదనపు పన్నులు విధించి పల్లెలలో స్కూళ్ళు, ఆస్పత్రులు, రోడ్లు వగైరా కట్టించాలని మనవిచేయుచున్నాను. ఈ భూసంస్కరణలు, మావల్ల వచ్చినవంటే మావల్లనని రాజకీయ పార్టీలవారు చెప్పుకుంటున్నారు. దీనివల్ల ప్రజల ఆర్థిక పరిస్థితి బాగుపడుతుందని గాని, జీవన ప్రమాణం పెరుగుతుందని గాని, నాకు నమ్మకం లేదు. వ్యవసాయ ఖర్చులు ఫలసాయంలో సగభాగముంటుందని చెప్పు వారికి అనుభవంలేదని చెప్పవలసి ఉంటుంది కొన్ని సారవంతమైన ప్రాంతాలలో ఖర్చులు సగభాగము ఉంటేఉండవచ్చును గాని మెట్ట ప్రాంతాలలో ఖర్చు సగభాగం కాదని నేను అనుకొనుచున్నాను. పంటలు పండడం అనేది గ్యారంటీ కాకపోవుటవల్ల రైతుల జీవనాధారం కొరకు ప్రతి గ్రామంలోను Cottage Industries ప్రోత్సహించాలి. పండించిన పంటకు గిట్టుబాటైన ధర లభించునట్లు చూడాలి. వారి పిల్లలకు విద్యాసౌకర్యాలు కలిగించాలి. లేనియెడల వారు ప్రభుత్వోద్యోగాలలోను, రాజకీయాలలోను, ఇతర రంగాలలోను చాలా వెనుకబడిపోతారు. ఇప్పుడు భూములపై వచ్చు ఆదాయంపై సీలింగు పెట్టినట్లే యితర వృత్తులకు గూడ సీలింగు పెట్టిననేగాని సంతృప్తికరమైన వాతావరణం ఏర్పడదు లేనియెడల వ్యవసాయ వృత్తికి అన్యాయం చేస్తున్నారని అభిప్రాయపడుతారు. వ్యవసాయదారులంతా పెట్టుబడిని వ్యవసాయవృత్తిపై వినియోగించి పొరపాటు చేశామని అనుకొనుచున్నారు. అపారధనాన్ని సంపాదించగల వృత్తులు చాలా ఉన్నవి. తెలివితేటలు గలవారు, అనుభవంగలవారు వ్యవసాయవృత్తిని వదలి యితర వృత్తులను స్వీకరించుటకు పట్టణాలకుపోయే ప్రమాదమున్నదని మనవిచేస్తున్నాను. ఈవిధంగా ఆర్థిక స్తోమతుగలవారంతా పట్టణాలకు తరలిపోయి వ్యవసాయ రంగమే దెబ్బతినే ప్రమాదమున్నది. వాన రైతులకు పెట్టుబడి, యింకా యితరమైన సౌకర్యాలను కలిగించాలి. తరువాత reclaimed lands సీలింగునుండి మినహాయించాలి క్రొత్త ప్రాజెక్టుల క్రింద భూములను, అరణ్య భూములను

క్రొత్తగా సాగులోనికి తెచ్చుటకొరకు ఎంతో డబ్బును వ్యయపరచవలసి యుండును. కాన అలాంటి భూములను కొంతకాలంవరకు సీలింగునుంచి మినహాయించాలి. ఈజిప్టులో గూడ అలాంటి భూములకు 10, 20 ఏండ్ల వరకు సీలింగు నుండి మినహాయింపు యిచ్చారు. ఇలాంటి సౌకర్యాలైనా కలుగజేయకపోతే ఆహారోత్పత్తి అధికంగాదు. వారిలో చదువు సంపద్యల technical knowledge లేక పోవుటవల్ల ఉత్పత్తి తగ్గిపోవుచున్నది. ప్రభుత్వం సరియైన సదుపాయాలు కలిగించనిచో ఆహార కొరత ఏర్పడి యితరదేశాలనుండి ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవలసిన అవస్థ మరల పట్టుతుందేమో అని అనుమానపడుచున్నాను. ముందుగానే తగు జాగ్రత్తపడి అటువంటి పరిస్థితిమాత్రం రాకుండా నివారించాలని మనవి చేయుచున్నాను. వ్యవసాయ వృత్తినుంచి అధిక లాభాలు వస్తున్నవనే భావం కొందరికి ఉన్నది. ప్రతి పది సంవత్సరాలలో 2, 3 ఏండ్ల వరకు క్షామము విలయ తాండవమాడుతుందనే విషయం అందరం ఒప్పుకుంటాము. ప్రతి పది సంవత్సరాలలో ఏ మూడు నాలుగు పర్యాయాలైనా వానలు కురిసి పంటలు పండకుండా చెడిపోవుటకూడా జరుగుచున్నది. అందువల్ల రైతులు ఆర్జించినా ఎంతో వెచ్చిస్తారు. ఒక తిరుగునంతా తీసివేసినా వ్యవసాయ వృత్తిపై పెట్టిన పెట్టుబడికి సరియైన interest గిట్టుబాటు కావడం లేదు. అలాంటప్పుడు వారా వృత్తి మీద ఎందుకు ఆధారపడి ఉన్నారని కొందరడగవచ్చును. విధి లేకనే, వృథాగా మాన్పించవలసి వస్తుందనే అభిప్రాయం చేతనే వారా వృత్తిలో నిమగ్నులై ఉన్నారు. ఆదాయమిచ్చే యితర వృత్తులలో ప్రవేశించుటకు అవకాశం లభించిన ఈ వృత్తిని క్షణమే వదలివేయుటకు సిద్ధంగా ఉన్నారు. వ్యవసాయదారుల ఆర్థిక పరిస్థితిని చూసినా, అధికసంఖ్యాకులు అప్పులపాలై ఉన్నారనే విషయం ఒప్పుకోవలసివస్తుంది. ఒకవేళ అది లాభసాటి వృత్తియే ఐనచో ఈ గతి వారికెందుకుపడుతుంది ? రైతు ఏ వస్తువును కొనబోయినా అమ్మేవాని దయా దాక్షిణ్యాలపై ఆధారపడవలసి వచ్చుచుండుటే గాక సంవత్సరమంతా పరిశ్రమపడి, ఎండనక కష్టించి పండించిన ఫలసాయాన్ని అమ్ముకోవలసి వచ్చినప్పుడు కూడ ఆ కొనే వారియొక్క దయా దాక్షిణ్యాల పైనే ఆధారపడవలసిన అధోగతిలో ఉన్నారని చెప్పుటకు చింతిస్తున్నాను. ధర పలుకు వరకు వేచి అమ్ముకోగలరనే ధైర్యంగాని, ఆర్థిక స్తోమతుగాని లేకపోవుటచే రైతులు దోపిడీకి గురి అవుతున్నారు. మనం యిటువంటివన్నీ కొన్ని చట్టాల ద్వారా "కంట్రోల్" చేయకపోతే, రైతు చాలా నష్టపడతాడని మనవి చేస్తున్నాను. రైతులను బాగుపర్చాలనే వారు, వారి పంటలను insure చేయడానికి అవసరమైన ధనాన్ని, ఎరువులను, నీటిని సకాలంలో అందచేయాలి. ఇవన్నీ చేయకుండా వ్యవసాయం, పంటలు అభివృద్ధి కావాలనుకోవడం వట్టి నిరర్థకం. కాబట్టి మనం ఏ చర్యలు తీసుకున్నా, వాటిని సంపూర్ణంగా అమలుచేయాలి. ఈ నాడు భూ సంస్క-

ఏణలు; రైతులకు కావలసిన ఉన్న సదుపాయాలు కల్పించడం చాలా అవసరం' లేకపోతే రైతాంగం-వ్యవసాయ వృత్తిలో ఉన్నవారు-నేటి ప్రపంచంలో చాలా వెనుక పడిపోయే అవకాశా లున్నాయి. ఇతర రంగాలలోని వారందరు అంతూ వంతూ లేకుండా సంపాదించడానికి అవకాశాలుండగా; ఒక్క రైతాంగం విషయంలో సంస్కరణలను ప్రవేశపెట్టి సంతృప్తిచెందడం, బీదప్రజానీకానికి తీరని అన్యాయం చేయడమే అవుతుందని మనవిచేస్తూ, నేను యింతటితో విరమిస్తున్నాను.

*Mr. Speaker*:- I want now the hon. Member Dr. Chenna Reddy to move his point of order. He seems to have taken some exception to this.

*Dr. M. Chenna Reddy* (Vicarabad-General) :- Mr. Speaker, yesterday, I had mentioneed that this Bill affects agriculture and also it affects the provisions of the legislation that has been passed by the erstwhile Hyderabad State. In a way, it also implies the question of co-operative farming at some later stage. I had therefore, submitted to you that this Bill should, in the first instance, be referred to the Regional Committee where it could be discussed in detail.

శ్రీ డి. హనుమంతరావు (జగ్తియాల్):—అధ్యక్షా, ఇప్పుడు మన ముందు చర్చలో నున్న యీ Ceiling Bill యిదివరకు తెలంగాణాలో నున్న శాసనాన్ని direct గాను, indirect గాను అన్ని రంగాలలో effect చేస్తోంది. ఈ Bill objects లో "over rides" అని ఉన్నది కనుక మొదట ఈ Bill ను Regional Committee కి re-fer చేసి, అక్కడ దీనిని గురించి సమగ్రంగా చర్చించిన తరువాతే, ఈ శాసన సభముందు ప్రవేశ పెట్టాలని మీకు మనవి చేస్తూ, డా॥ చెన్నారెడ్డిగారి అభిప్రాయాన్ని నేను బలపరుస్తున్నాను.

శ్రీ కె. ఎల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్) అధ్యక్షా, ఇప్పుడు డా॥ చెన్నారెడ్డిగారు move చేసిన point of order ను గురించి నేను కూడా రెండు విషయాలు చెప్ప దలచాను. Telangana Regional Committee కి కొన్ని subjects ను అప్పగించారు. వాటిలో agriculture, భూమి అమ్మకాలు కూడా ఉన్నాయి. ఈ నాడు శాసన సభలో ప్రవేశ పెట్టబడిన బిల్లు భూమి అమ్మకాలను, వ్యవసాయ విధానాన్ని, వ్యవసాయదార్ల సమస్యలను deal చేస్తోంది. కాబట్టి ఈ బిల్లును Regional Committee కి పంపడం అవసరం. దానికి refer చేయమని కోరే హక్కు మాకున్నదని మనవి చేస్తున్నాను.

శ్రీ బసవ మానయ్య (ఆందోల్):—అధ్యక్షా, శ్రీ చెన్నారెడ్డిగారి అభిప్రాయాన్ని బలపరచటానికి నేను ఆజ్ఞ కోరుతున్నాను. భూసంస్కరణల బిల్లు money bill ఏమీ కాదు. దీనిని Regional Committee కి refer చేయ డానికి ప్రభుత్వానికి ఏవిధమైన ఆలోచనా అవసరం లేదు. ఇప్పుడు తెలంగాణాలో అమలులోనున్న Tenency Act లో రూ 3,600/- ల గరిష్ఠ ప్రమాణంగా నిర్ణయిస్తే నే ఖమ్మం జిల్లా మగతాలు, తాలూకాలో 77 మందికి ఒక్కొక్కరి వద్దే భూమి పంచటానికి మిగిలింది. ఇప్పటి Bill ప్రకారం Rs. 5,400/- గరిష్ఠ ప్రమాణం నిర్ణయిస్తే, అసలు ఏమీకూడా మిగలదు. లోగడ "గైరాన్" భూములు సాగు చేసు కోవడానికి యిచ్చినప్పుడు, ఆ విషయం Regional Committee కి refer చేశారు. అదే విధంగా ఈ Bill ను కూడా refer చేయమని కోరుతున్నాను.

శ్రీ బి. కేశవరెడ్డి (ఘన్‌పూర్):—అధ్యక్షా, ఈ motion ను support చేస్తూ 1-2 విషయాలు చెప్పదలచాను. Schedule లో "Sale of Agricultural Land" అంటే ఏమో వివరించ బడింది. దానితో పాటు Item No 8 లో Agricultural Co-operative Society విషయం కూడా వివరించ బడింది. ప్రస్తుత Bill ద్వారా sale of land పైన నిర్బంధం పెట్టడమే కాక agriculture ను ఒక విధంగా affect చేస్తోంది. ఈ బిల్లు "Agricultural Co-operative Societies" ను exclude చేస్తోంది. కాబట్టి, మనం చర్చిస్తున్న Bill ఈ మూడు, విషయాలను affect చేస్తోంది. ఈ బిల్లులో "Agriculture" అనే పదాన్ని define చేయక పోయినా, పూర్వపు Hyderabad Act లో define చేయడం జరిగింది. ఆ definition ప్రకారంగా, ఏవిధంగాచూసినా, ఈ Bill Hyderabad Act ను over ride చేస్తూ దానిని affect చేస్తోంది కాబట్టి, తప్పకుండా ఈ విషయం Regional Committee కి refer చేయవలసి ఉంది. ఇటువంటి విషయం Regional Committee కి పంపవలెనో, లేదో తమరు గత Bill [illegible] సమగ్రంగా విచారణ చేశారు. తమరు ఆరంభంలోనే కొన్ని procedures నిర్ణయించాలి, లేదా ప్రభుత్వమే ఈ Bill ను Regional Committee కి పంపాలి. ఇవేవీ జరగకపోగా, కనీసం గవర్నర్ గారికైనా పంపకుండా, దీనిని పాసుచేయవని మనవి చేస్తున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం):—అధ్యక్షా, ఈ Bill ప్రధానంగా భూములపైన ఒక పరిమితిని నిర్ణయించడానికి ఉద్దేశించబడింది. ఇంతకు మించి దీనిలో భూముల అమ్మకానికి, తనఖాకు సంబంధించి ఏమీలేదు. ఇప్పుడు తెలంగాణాలో భూపరిమితికి సంబంధించి ఒక చట్టం అమలులో ఉంది. ఇప్పటి బిల్లు ప్రధానంగా ఆంధ్ర ప్రాంతానికి ఉద్దేశించ బడింది. అందువల్ల దీనిని

Region d Committee కి refer చేయవలసిన అవసరం లేదని అభిప్రాయ పడుతున్నాను. ఆ విధంగా refer చేస్తే చాలా కాలయాపన, నష్టం జరుగుతుందని తమకు మనవి చేస్తున్నాను.

శ్రీ కె. రామచంద్రారెడ్డి (రామన్నపేట):—అధ్యక్షా, ఈ Bill అమ కాలకు effect చేయదని శ్రీరామమూర్తిగారు చెప్పారు. అది సరైన అభిప్రాయం కాదు. ఎందుచేతనంటే రూ॥ 5,400/—లకు ceiling ను పెంచడం వల్ల లక్షలాది ఎకరాలు తెలంగాణాలో అమ్మబడుతున్నాయి. ప్రధానంగా మధ్య తరగతి రైతాంగం ఈ భూములను కొన్నది. ఈ Bill యింకా శాసనం కాకముందే, గరిష్ఠ పరిమితి తప్పక రూ॥ 5,400/ లు ఉంటుందనే ధైర్యంతో, భూస్వాములు రైతులను "బేదఖల్కు" చేస్తున్నారు. రైతులు "మే మిచ్చిన డబ్బుమాట ఏమిట"ని అడిగితే, అది 'మునాఫా క్రింద పోతుంది"ని చెబుతున్నారు. ఈ Bill యింకా pass కాకుండానే, అక్కడ అమలు జరుగుతోంది. ఈ విధంగా ఈ బిల్లు అమ్మకాలను affect చేస్తోంది. అందువల్ల దీనిని తప్పకుండా Region d Committee కి పంపాలి.

శ్రీ యస్. వి. కె. ప్రసాద్ (చెన్నూర్) :— అధ్యక్షా, ఈ Bill లో land sales విషయం కూడా direct గా పెట్టబడి ఉంది. Notified date నుంచి l n' s les నిషేధిస్తుంది అనే మాటను పెట్టడంలో గల ఉద్దేశ్యమేమిటి? Hyder b d Ten ncy Act లో ఉన్నట్లుగానే దీనిలో కూడా land sales పూర్తిగాను, స్వేచ్ఛగాను చేసికోవచ్చుననే అవకాశాలు కలిగించే implications ఉన్నాయి. Leg l అభిప్రాయం తీసుకున్నా కూడా clause 14లో Prohibition of alien tion of holding అనేది స్పష్టంగా ఉంది. అయితే notifiel date నుంచి "No person owning l n l in excess of permissible holding, sh ll lien te his holling or ny p rt there of by w y of s le, gift, exch nge or otherwise" అని ఉంది. అందువల్ల మొత్తం తెలంగాణాకు కూడా వర్తిస్తుంది. ఇది మంచికా? చెడ్డకా? అనే చర్చలోకి పోవడం లేదు. కాబట్టి "Technic l" గా చూస్తే ఈ Bill, land sales విషయంలో effect చేస్తుంది మొత్తంగా Agriculture అంటే తెలంగాణాకు సంబంధించిన సమస్యలు కూడా effect అవుతాయి. అందువల్ల ఈ Bill ను Telangana Region l Committee కి కూడా పంపి, దానియొక్క అభిప్రాయం తెలిసికోవడం మంచిదని మనవి చేస్తున్నాను.

శ్రీ కె. వెంకట్రావు:— అధ్యక్షా, ఆ విషయములో మీరు యిదివరకు ఎంట్రీగురించి ఒక రూలింగు యిచ్చారు. అందుచే నేను యిప్పుడు దానినిగురించి

ఆర్గ్యూ చేయదలచుకోలేదు. ఎంట్రీ పదునాలుగు, పదునెనిమిది ఆ షెడ్యూలులో ఉన్నాయి. దాని ప్రకారం సేల్ ఆఫ్ లాండ్ అనేది తప్ప మిగతావానికి అవి వర్తించవు అని మీరు రూలింగు యిచ్చారు.

"The important condition specified in paragraph 5 of the Regional Committee Order is that a Bill which has to be referred to a Regional Committee should contain mainly provisions relating to a scheduled subject."

ఈ 'mainly' అనే దాని యింటర్‌ప్రెటేషన్ గురించి తమకు ఒక certificate గవర్నరుగారి నుండి వచ్చింది.

"A Bill can contain several provisions but we should decide whether the main provision of the Bill relates to the Scheduled subject."

ఇంతవరకు ఏ సభ్యుడు కూడా Main Provision గురించి చెప్పలేదు. ప్రసాద్‌గారు మాత్రం ఆ మాట వుందని చెప్పారు.

"The main provision of the Bill or the main purpose and character of the Andhra Pradesh Agricultural Holdings Bill is the imposition of a ceiling on existing and future agricultural holdings The authority for this legislation is the opening words of Entry 18 of the State List in the 7th Schedule to the Constitution viz., "Land, that is to say rights in or over land" This portion of the entry is sufficient to give the legislature authority to extinguish or modify any rights in land. The main provisions of the Bill viz., 'the imposition of ceiling on agricultural holdings' rests on this portion of the entry viz., "land, rights in or over land" in the State List.

The other provisions of the Bill dealing with the transfer and alienation of lands are purely incidental and ancilliary to the main purpose of the Bill. Even as regards these incidental provisions, most of them relate to involuntary or compulsory transfers effected by operation of law. According to the recent decision of the Supreme Court in State of Madras Vs. Gannon Dunkerly & Co. Ltd., Madras involuntary or compulsory transfers or sales in which there is no element of bargain. do not come within the scope of 'sale'. The only direct provisions in this Bill relating to voluntary transfers are Clauses 14 and 15. Clause 14 prohibits sale of holding until a decla-

ration is furnished and the Revenue Divisional Officer determines the excess holding that a person has to surrender Clause 15 (1) prohibits only purchase and acquisition (and not sale) until the notified date Thus the restrictions are only for a very limited period to enable the determination of holding These temporary restrictions in Clauses 14 and 15(1) of the Bill are purely incidental and ancilliary to the main purpose of the Bill Even without specifically referring to these restrictions the main object of the Bill could be achieved by merely providing that the ceiling limit on existing and future holdings shall be such and such limit, Such a provision will carry with it by implication a prohibition on acquisition or transfer in excess of the limit What has been done in the Bill is only to make these implications clear It is therefore clear beyond doubt that the provisions of Clauses 14 and 15 relating to voluntary transfers and acquisitions are merely incidental and ancilliary to the main purpose of the Bill

According to paragraph 5 of the Regional Committee Order a Bill which does not mainly relate to a Scheduled subject but deals with that subject only as incidental and ancilliary matter to the main provision need not be referred to the Regional Committee The Andhra Pradesh Ceiling on Agricultural Holdings Bill is of this category

It may be mentioned in this connection that in the Osmania University Bill which recently was introduced in the Assembly, there were certain provisions relating to "regulation of admissions to colleges" which is a Scheduled item i e, item 4 of the Schedule in the Regional Committee Order It was ruled by the hon Speaker that these provisions in the University Bill relating to admissions to colleges were only ancilliary and incidental to the main provisions of the Bill viz, the constitution and functions of the University On this ground it was held by the hon Speaker that the Bill need not be referred to the Regional Committee The principle of that ruling will equally apply to the Andhra Pradesh Ceiling on Agricultural Holdings Bill

I, therefore, submit, Sir, that this Bill need not be referred to the Regional Committee

*Mr Speaker* It is legal opinion which is accepted by the hon Minister So it is the opinion of the Government

Yes I agree with the hon Revenue Minister that this Bill mainly deals with fixation or imposition of ceiling on agricultural holdings and the other provisions are all ancillary Therefore, if we go on in this way every thing will come under the purview of the Regional Committee because it may affect the sale, prices, etc All that is there but that is not the point The question is What is the object of the Bill? The object of the Bill is to fix

*Dr M Chenna Reddi* - Mr Speaker, Sir It is yet to be seen what the scope of the Regional Committee at all is and what the functions of the Regional Committee will be If one Bill has to be ruled out by the Governor and this Bill ruled out by you, I do not think there will be much left for the Regional Committee

*Mr Speaker* I cannot help it I can only say that this Bill does not come in the purview of the Regional Committee

*Dr M Chenna Reddi* —I would like to have a clarification sir, that in cases like these where the hon Speaker holds this kind of view and gives a ruling and when we want some further appeal to the Governor what procedure should be adopted

*Mr Speaker* - I do not know whether you have any appeal against the Speaker (laughter)

*Dr M Chenna Reddi* - In cases like these, it is not a question of an ordinary ruling of the Speaker on the procedure of the Assembly But as I feel that this is a matter where the Governor is supposed to be the final authority I would request you to give a consideration to this matter and let us know what further steps we can possibly take in getting these matters finalised

*Mr Speaker* —I do not see any provision to that effect

*Sri Kala Venkata Rao* You have already ruled, Sir, that where you do not feel any doubt you need not refer the matter to the Governor It is only when you feel a doubt that the matter has to be referred to the Governor

*Mr. Speaker*:—Yes, that ruling is still in force

*Sri G. Latchanna*.— Sir, the hon. Speaker has got a right to change opinion on his earlier ruling, also.

*Mr. Speaker*:—There is no necessity for changing now. If there is any necessity, I am prepared to change and I tell you that I am not going to stand on false prestige.

*Dr. M. Chenna Reddi*:—I thought, Sir, that I clarified that this is a situation where there is a necessity that there should be some provision to enable us to go to the Governor. Any matter of this nature should be decided by the Governor. The hon. Speaker may have taken a view, it may be correct and it may be upheld by the Governor also. But we would like to try and get the opinion of the Governor also.

*Mr. Speaker*:—I am not prepared to surrender my jurisdiction and my rights to the Governor. That is certain. The only thing is that when I feel a doubt, I do not take the responsibility because it may be a decision either this way or that way. Then I send the matter to the Governor and let him give a certificate whether it comes under the Regional Comtee or not. But, when I think that there is no doubt in the matter and it does not come under the Regional Committee's purview, I cannot write to the Governor and say: "Mr. Governor I am helpless and I do not know any thing." I cannot do that. Supposing I feel that a Bill has to go to the Regional Committee, then I decide in that way and I do not want to send it to the Governor.

In this case as we have already observed and as the Certificate of the Governor has indicated, it does not deal mainly with any of the Scheduled Matters. In the Regional Committee Order, 1958, it is said: "Every Bill affecting the Telangana region which is not a Money Bill and contains mainly provisions dealing with any of the scheduled matters.. ." So, if a Bill deals mainly with public health and sanitation, or local hospitals and dispensaries, or primary and secondary education or any other scheduled matter, then it will have to go to the Regional Committee. Therefore, why does hon. Dr. Chenna Reddy feel that he is helpless when there are so many other matters which come under the purview of the Regional Com-

mittee? To say that this Bill will affect prices, agriculture, etc., is all a far-fetched argument which I do not agree. I hold that this is not a Bill which comes under the purview of the Regional Committee and I now call upon the hon. Members to proceed with the discussion.

శ్రీ జి. లచ్చన్న (సోంపేట):—ఒకటిన్నర గంటసేపు యీ సమస్యపైననే చర్చ జరిగింది.

మిస్టర్ స్పీకర్:—మరొకరోజు ఎక్కువ యిస్తున్నాను. 21వ తారీఖు వరకు కూడా దీనిపై చర్చ ఉంటుంది.

శ్రీ పి. నరసింహప్పారావు (పాలకొండ):—అధ్యక్షా, ఎప్పుడు సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి అవుతారా, ఎపుడు భూసంస్కరణల బిల్లు పెట్టుతారా అని ప్రజలందరు స్వాతంత్ర్యానకు ముత్యపు చిప్పలవలె యెదురుచూచారు. ఈ బిల్లును యింత త్వరగా తయారుచేసి, సభవారి ముందుకు తెచ్చినందుకు వెంకట్రావు గారికి మా కృతజ్ఞతలు తెలుపుతున్నాను. మిగిలిన యింకా కొన్ని విషయాలపై కూడా తేబోతున్నామని వెంకటరావుగారు చెప్పారు. Factories కు సంబంధించి, mica mines సంబంధించి భవనాలకు సంబంధించి, యీమాదిరి బిల్సునే తెస్తున్నాము అని వారు చెప్పినందుకు వారిని మరొకసారి అభినందిస్తున్నాను. మేము ప్రతిపక్షంలో ఉన్నప్పటికీ ప్రభుత్వంతెచ్చే ప్రతి ప్రతిపాదనను విమర్శించే అలవాటు మాకులేదు.

శ్రీ జి. సూర్యనారాయణ (గజపతినగరం—రిజర్వుడ్):—వారు ప్రతిపక్షంలో ఉన్నామని అంటున్నారు; ప్రతి పక్షంలో కలిసి ఎప్పుడూ వోటు చేయలేదేమో ?

శ్రీ పి. నరసింహప్పారావు:—ప్రభుత్వం మంచిపనులు చేసినా విమర్శించాలని మా ఉద్దేశం కాదు. ప్రతిపక్షంలో ఉన్నా ప్రభుత్వం మంచిపనులు చేస్తున్నపుడు support చేయాలనే మా అభిప్రాయం.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ):—ఆయన ఏ ప్రతిపక్ష పార్టీలోను లేదే!

మిస్టర్ స్పీకర్:—లేకపోతే మరీ సంతోషం. మీకెందుకు? Responsive Co-operative Parties అని కొన్ని ఉంటాయి. మంచిపని చేస్తుంటే సహకారం

యిస్తాము. లేకపోతే ప్రతిరేకిస్తాము అనేవి; There are such parties in the world.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—వారి పార్టీ dissolve చేశారు కదా!

శ్రీ పి. నరసింహప్పారావు:—మరొక పార్టీ పెట్టుతున్నాము. మీకేమి తెలుసును?

శ్రీ కె. వెంకటరావు:—ఆర్డర్, ఆర్డర్—వారిద్దరు మాట్లాడుకో కూడదండీ.

మిస్టర్ స్పీకర్:—ఇంకా క్రొత్త పార్టీని recognise చేయలేదు. అందుచేత వారు వ్యక్తిగానే మాట్లాడవచ్చు.

శ్రీ పి. నరసింహప్పారావు:—పది నిమిషాలలో సగం యిందులోనే పోయింది. ఈ బిల్లులో 5400 రూపాయల నికరాదాయం వచ్చే భూమి అన్నపుడు ఏధరనుబట్టి దానిని నిర్ణయిస్తారు? ధరల స్థిరీకరణచేసి యింతకాలం యీ ధరలు ఉంటాయి అని నిర్ణయించి ఆ ధరలను ఆధారంగా చేసుకుని సీలింగు పెడితే బాగుంటుంది. 15 సంవత్సరాల క్రితము 50 రూపాయలు గరిసె ఉండేది. యుద్ధం వచ్చినతరువాత 300 రూపాయలైనది తరువాత 1000 రూపాయల వరకు కూడా గరిసె వెళ్ళింది. ఇపుడు 300 వరకు వచ్చింది. రేపు 200 రూపాయల వరకు పోతుందేమో చెప్పలేము. ధరలను మొదట్లో స్థిరీకరణచేసి సీలింగు పెట్టాలని కోరుతున్నాను. వారి యిండ్లలో కూడా పెండ్లిండ్లు చేయాలి. పిల్లలు చదువులు చదువుకోవాలి. వీటి అన్నింటికి ఎంత సరిపోతుందో సెలక్టుకమిటీలో నిర్ణయించి సీలింగు పెట్టాలని కోరుతున్నాను. 1000 రూపాయలు పైగా జీతం తెచ్చుకునే జీతగాళ్ళున్నారు. వారికి ఏమి సీలింగు లేదు. వారి పిల్లలు చదువుకోవాలి; వారు కార్లు ఎక్కే యోగం ఉన్నది. వీరికి మాత్రమే ఆ యోగం ఎందుకు ఉండకపోవాలి? హెచ్చుజీతం పుచ్చుకునే వాడు మాత్రమే ఎందుకు అనుభవించాలి? ఈ విషయమై కొంత allowance యివ్వాలని మనవిచేస్తున్నాను. Estate Land Act యిదివరలో తెచ్చారు, రైతులకు మేలు చేద్దామని. నిన్నటి వరకు ఆ చట్టానికి సవరణలు వస్తూనే ఉన్నాయి. చేసే చట్టం సమగ్రంగా యిక సవరణలేదనే పద్ధతిలో ఉండాలి కాని రైతులు, భూస్వాములు ఎన్నాళ్ళు కోర్టులచుట్టూ తిరుగగలరు? Estate Land Act కు ఎన్నోసార్లు సవరణలు రావడంతో కోర్టుల చుట్టూ తిరగలేక నానా బాధలు పడ్డారు. అటువంటి చట్టాలవల్ల ఎవరికీ ఏమీ లాభం ఉండదు. అవసరమైతే యింకా కొంచెం కాలం తీసుకుని అయినా సమగ్రమైన చట్టం తీసుకుని వచ్చి రైతుకు భూస్వామికి ఉండే సంబంధాలు ఖచ్చితంగా తేలిపోయేటట్లు చేయాలని

ఖర్చుచేయడానికి అవకాశాలు కల్పించడం సాంఘిక న్యాయమనిపించుకోదు. రైతాంగము మాత్రమే పరిమిత ఆస్తులలో జీవించాలని అంటే అది యీ దేశంలో సాధ్యం కాని పని. రైతాంగము అందుకు అంగీకరించదు. భూ కమతాలకు పరిమితులు పెట్టడం ఎల్ల దేశంలోని బీదతనాన్ని కొంతవరకు తగ్గించడానికి అవకాశం ఉంటుంది. మనం ఒక నిర్ణయానికి వచ్చినపుడు దానిని రైతాంగము ఆమోదించింది. 54 వందల రూపాయల నికరాదాయం ఎచ్చే భూమిని రైతుకలిగి ఉండాలనే విషయాన్ని ప్రభుత్వం ఎంతో పరిశీలించిన మీదట నిర్ణయించి ఉంటుందని నేను ఆశిస్తున్నాను. అయితే ఇతర ఆస్తుల పైకూడా పరిమితి ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉండాలి. ఇందుకు మనకు అధికారం ఉన్నదా లేదా అనే విషయం వేరు. శాసన సభలోని అన్ని వర్గముల వారు ఢిల్లీ ప్రభుత్వముపై వత్తిడితెచ్చి అవసరమైతే రాజ్యాంగ చట్టాన్ని మార్చటానికి కూడా ప్రయత్నించాలి. ఇతర ఆస్తులపై కూడా పరిమితి నిర్ణయించ వలసిన అవసరం ఉన్నది. నూటికి 75 ఎంతులకుపైన ఉన్న రైతాంగము ఎన్ని యిబ్బందులు పడుతున్నప్పటికీ తమ ఆస్తులను పరిమితం చేసుకోవడానికి అంగీకరించినపుడు యితర వర్గాలవారు ఆ మార్గాన్ని అనుసరించాలి. ఆవిధంగా జరగటానికి రైతాంగము ఆందోళన చేస్తున్నదని ఇక్కడ ఉన్న ప్రతి శాసన సభ్యునకు తెలియును. రైతు పడుతున్న ఇబ్బందులు తెలిసి కూడా తన ఆస్తిని పరిమితం చేసుకోవడానికి అంగీకరించనపుడు ఇతర ఆస్తులలో ఆవిధంగా పరిమితం చేసుకోవడానికి వ్యతిరేకత తెలిపే సభ్యులు యీ శాసన సభలో ఉన్నారా అని అడుగుతున్నాను. ఇతర ఆస్తులను పరిమితం చేయడానికి సంజీవరెడ్డిగారు ధైర్యంతో పూనుకోవాలి.

మిస్టర్ స్పీకర్:—అవి కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన విషయాలు.

శ్రీ జి. లచ్చన్న:—మంత్రుల జీతాలు, రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల జీతాలు మనకు సంబంధించినవే.

శ్రీ ఎల్. లక్ష్మణదాసు:—మానవులందరికీ సమాన హక్కులు వుండాలని సాంఘిక న్యాయం అందరికీ కలుగ చేయాలని మనం ఎంతోకాలంగా అనుకుంటు న్నాము. వ్యవసాయాదాయాలపై పరిమితి ఏర్పాటు చేయ దలచినపుడు ఇతర ఆస్తులపై కూడా పరిమితి నిర్ణయించడానికి మనకు సర్వ హక్కులు ఉంటాయనీ, ఉండాలనీ నేను ఆశిస్తున్నాను. వ్యవసాయ రంగంలో యీ నాడున్న ఒడుదుడుకులను చాలా మంది గమనించ లేక పోతున్నారు. రు 54 వందల రూపాయల నికరాదాయమనేది రైతులకు ఎల్లప్పుడువచ్చే అవకాశమున్నదా అనే విషయం గమనించాలి. భూమిపై తనకు ఖచ్చితమైన ఆదాయం వస్తుందనీ, రైతుకు హామీ ఉన్నదా అని అడుగుతున్నాను. రైతుకు ఖచ్చిత మైన ఆదాయం రావాలంటే ప్రభుత్వం ఎన్నో

సౌకర్యాలు కల్పించ వలసి యున్నది. నీటివసరులు బాగుచేయించాలి. క్రొత్తవసతులను ఏర్పాటు చేయించాలి. న్యాయమైన వడ్డీకి రైతాంగానికి యీనాడు అప్పులిచ్చేవారులేరు. కనీస ధరలు రైతులకు ముట్టాలి. మార్కెట్ సౌకర్యాలు కల్పించాలి. క్రాప్ ఇన్సూరెన్సు రక్షణ రైతులకుండాలి. ఇవేవీ లేనపుడు రైతుకు యీ 54000 రూపాయల నికరాదాయం ఎలావస్తుంది. మా శ్రీకాకుళం జిల్లాలోని 3,4 తాలూకాలలో మొన్న సెప్టెంబరు పంటలు పోయాయి. నష్టపడ్డ ఆ రైతులకు పరిహారం యిచ్చినవారు ఎవరు. వారికి పరిహారం యీయవలెనంటే ఎన్నికోట్ల రూపాయలైనా సరిపోవు. సౌకర్యాలు కలుగ చేయకుండా ఆదాయాలకు పరిమితి పెడతామనడం వల్ల రైతాంగము యిబ్బందుల పాలవుతుందేకాని ప్రభుత్వము ఆశించిన సత్ఫలితాలు సాధించలేము. 5400 రూపాయలు నికరాదాయాన్ని యిచ్చే భూ కమతాలను గరిష్ఠపరిమితి గంపగా నిర్ణయించినందుకు కమ్యూనిస్టు సోదరులు విమర్శించారు. వారికి భూమిపైన భూమిని దున్ని పంట పండించేవారిపైన విశ్వాసం లేదని అందరికీ తెలిసినదే. సిద్ధాంత రీత్యా వారు ఆవిధంగా చెప్పవచ్చునేమోకాని యీ దేశ పరిస్థితులకు వారి సిద్ధాంతము సరిపడదని మనవిచేస్తున్నాను. మనదేశంలో ఆపద్ధతి సాగదు. చైనా దేశంలో ఆ పద్ధతి సాగలేదు. చైనాలో పెద్ద భూస్వాములను ఏమీ చేయలేదు చిన్నచిన్న రైతులకున్న భూములనన్నిటిని సమీకరించి సహకార వ్యవసాయ క్షేత్రాలుగనో సమిష్టి వ్యవహారిక క్షేత్రాలుగనో రూపొందించడం జరిగింది. ప్రజాస్వామికంలో విశ్వాసమున్న యీ దేశంలో కమ్యూనిస్టు సిద్ధాంతాలను అమలు పరచడం సాధ్యమైన పనికాదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఎంతో ధైర్య సాహసాలతో భూకమతాల పరిమితి నిర్ణయించుటకు యీ బిల్లు తెచ్చినందుకు వారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ఇతర వృత్తులలో కూడా యీ పరిమితిని నిర్ణయించినపుడే యీ సభలోని మూడువందల సభ్యులు ప్రభుత్వానికి సహకరించగలరని ఆనందిస్తున్నాను. ఇతర ఆస్తులకు పరిమితిలేకుండా రక్షణ యిచ్చుటకు ఏ సభ్యుడైనా ప్రయత్నించినచో అట్టివానికి దేశంలో ఎటువంటి అవకాశాలుంటాయో, ఎటువంటి పరిస్థితులను ఎదుర్కొనవలసి ఉంటుందో మనమందరము వూహించుకొనగలము. అందువల్ల ప్రభుత్వం యీ విషయంలో కట్టుదిట్టమైన చర్యలు తీసుకొని యితర వృత్తులలోని వారి ఆదాయాలపైన కూడా పరిమితులు నిర్ణయించవలెనని కోరుచున్నాను. పట్టణములను మనమే తయారుచేస్తున్నాము. పట్టణములలో ఏదైనా ఆఫీసుపెట్టినట్లయితే యిదివరకు ఎకరము వంద రూపాయలు చేయని భూమి పదివేలు, పదిహేనువేలకు పెరిగిపోతోంది. ఈ విధంగా అని ఎరన్డ్ యిన్కం వచ్చినవారినుంచి కొంత డబ్బును ప్రభుత్వం ఎందుకుతీసుకోరాదు. ఈ విధంగా చెప్పినట్లయితే ప్రభుత్వానికి ఎంతో ఆదాయం వస్తుంది. ఎన్నో సౌకర్యాలు రైతులకు, ప్రజలకు కలుగచేయటానికి అవకాశం ఉంటుంది. స ం ఘ ం లో ని అన్ని వర్గాలవారికి సౌకర్యాలు

తెలుగజేయవచ్చు ప్రభుత్వం ప్రవేశపెట్టిన యీ సంస్కరణలవల్ల పేదవారికి పంచటానికి ఏమీ భూమి ఉండదని కమ్యూనిస్టు సోదరులు విమర్శిస్తున్నారు. 1914వ సం॥ తరువాత బ్రిటిష్ ప్రభుత్వంవారు సైన్యం నుంచి విడుదల చేయబడ్డ సిపాయీలు పెంపరహా భూములిచ్చారు. ఈనాడు ఆభూములపైన ఒక్క సోల్జర్ అయినా ఉన్నాడా అని అడుగుతున్నాను. వ్యవసాయమనేది సులువైన పనికాదు వ్యవసాయం పైన, భూమిపైన నమ్మకముంచి పండినా ఎండినా దానికదే ఆధారమని నమ్ముకున్న రైతునకే వ్యవసాయివృత్తి అలవడుతుంది. ఏదో కొద్దిభూమి పంచినంతమాత్ర మున వారినందరినీ గ్రామాలలోనే నివసించేట్లుగాని, ఆ భూమిపై ఆధారపడి వ్యవసాయం వృత్తిగా పెట్టుకొని జీవించేట్లుగా గాని చేయలేము. ఒక సంవత్సరం పండకపోయినా మరల విత్తనాలుతెచ్చి సాగుచేద్దామనే నమ్మకం. స్తోమతు ఉన్నవారికే వ్యవసాయం గిట్టుబాటు కాగలదు. ఈ విషయములన్నిటినీ దృష్టిలో పెట్టుకొని అధిక ఆహారోత్పత్తి సాధించాలనే సంకల్పంతో యీ భూసంస్కరణలు అమలుచేయవలసి యున్నది. అవసరమైన మార్పులు యీబిల్లులో చేయవచ్చును. ఐతే యితర వర్గాల వృత్తుల వారి ఆదాయాన్నిబట్టికూడా సక్రమమైన పరిమితులు నిర్ణయించవలసిన అవసరం ఎతైనా ఉన్నది. రైతాంగానికి 5400 రూపాయల నికరాదాయాన్ని పరిమితిగా పెట్టినపుడు అదే పరిమితిని యితర వృత్తులవారికి కూడా అన్వయించి కొంత అనుభవము గడించినతరువాత యీ పరిమితి హెచ్చుగాఉన్నదని గ్రహించుకొనిన తరువాత 3,000 కో 2 వేలకో తగ్గించుకోవచ్చు. కొంతమంది యీ పరిమితి హెచ్చుఅని విమర్శించినంత మాత్రాన ప్రయోజనంలేదు. ఎంతో ధైర్యసాహసాలతో యీ బిల్లును తెచ్చిన శ్రీ సంజీవరెడ్డిగారిని అభినందిస్తున్నాను. ఈ అవకాశమిచ్చినందుకు తమకు నా ధన్యవాదములు తెలుపుచున్నాను.

శ్రీ వై. ఆదినారాయణరెడ్డి (రాయదోటి):—మిస్టర్ స్పీకర్ సర్, శ్రీ వెంకట్రావుగారు యీ భూసంస్కరణల బిల్లును ప్రవేశపెట్టి, ఏ రాష్ట్రంలో ఎవరూ చేయని పని, యీ రాష్ట్రంలో చేస్తున్నారు. దేశం మొత్తంమీద భూసంస్కరణలు కావాలని, చాలా దినాలనుండి అన్ని పార్టీలవారు కోరుతున్న సంగతి మనకు తెలుసు. కాని 'భూమి ఆస్థి' ఉన్న రైతాంగానికి "యింతమాత్రమే ఆస్థి ఉండాలి. ఇంతకంటే ఆస్థి పెంచుకోకూడదు" అనే నిర్ణయం ఏ రాష్ట్రంలో కూడా చేయలేదు అని నేను అనుకుంటున్నాను. వెనుకటి హైదరాబాదు రాష్ట్రంలో మాత్రమే ఆవిధంగా చేయ బడింది. హైదరాబాదు రాష్ట్రంలో తెలంగాణా ఏరియా ఆంధ్రరాష్ట్రంలో చేరింది గనుక, తెలంగాణా ప్రాంతంలో ఉన్న పద్ధతి యిక్కడ క్రోడీకరించుటకు, యీ సీలింగు పద్ధతి యిక్కడకూడా ప్రవేశపెట్టబడిందని అనుకుంటున్నాను. "ఒక్క రైతులకు మాత్రమే సీలింగు ఎందుకు పెట్టాలి? ఇతర ఆదాయాలు వచ్చేవారికి కూడా

సంఘటనలు గ్రామాలలో జరుగుతున్నాయి. ఈ సీలింగు పెట్టినందువల్ల సైకలాజికల్‌గా ప్రభుత్వంమీద, ప్రభుత్వ పార్టీమీద వ్యతిరేకత ప్రబలుతోంది. ప్రభుత్వ పార్టీమీద అభిమానం సన్నగిల్లుతోంది. కాబట్టి, సెలక్ట్ కమిటీలో మంత్రులు. సభ్యులు జాగ్రత్తగా ఆలోచించి, తగు మార్పులు చేస్తారని నేను ఆశిస్తున్నాను.

ఈ సీలింగును గురించి, బిల్లులో పెట్టిన క్లాజులో గ్రాస్‌యిన్‌కమ్‌లో సగం నెట్‌యిన్‌కమ్‌క్రింద లెక్కవేయాలని సూచించారు. గ్రాస్‌యిన్‌కమ్ ఎంత రూపాయలైతే రు. 50 నెట్ యిన్‌కమ్ అవుతుంది. అంటే నూటికి 50 పంతులు ఖర్చులుంటాయని లెక్కకట్టారు. దీనివల్ల బావులక్రింద సేద్యంచేసే రైతాంగానికి చాలా నష్టము చేసినవారము అవుతాము. రాయలసీమలో హెచ్చుభాగము బావుల క్రింద సేద్యము చేయటము ఉన్నది. అన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. ఎటువంటి పరిస్థితులలో అయినప్పటికీ, బావులక్రింద సేద్యంచేసే రైతాంగానికి నూటికి 60 పంతులు ఖర్చులు ఉంటాయి. నూటికి 50 పంతులు నెట్‌యినకమ్ అనే పరిమితి తీసివేసి, "నూటికి 60 వంతులు" అని మార్చాలని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

నరసింహమూర్తిగారు మాట్లాడుతూ కాన్‌స్టిట్యూషనల్ పాయింటు రెయిజ్ చేశారు. భూమికి కాంపెన్‌సేషన్ యిచ్చే విషయంలో, ఒక కమతానికి యింకో కమతానికి విభేదం చూపించే పరిస్థితి ఉన్నది. గ్రేడెడ్ కాంపెన్‌సేషన్ యివ్వటంలో విభేదాలు చూపించే పరిస్థితి ఏర్పడుతున్నది. ఈ విషయాన్ని మంత్రిగారు ప్రత్యేకంగా ఆలోచించాలి. ఒక ప్రక్కనున్న పొలం పెద్ద ఆసామిది అయి, దాని ప్రకనే ఉన్న పొలం చిన్న ఆసామిదైతే, పెద్ద ఆసామికి పదిరెట్లు, చిన్న ఆసామికి 5 రెట్లు కాంపెన్‌సేషన్ యివ్వటం జరుగుతుంది. ప్రజలలో యీ డిస్క్రిమినేషన్ చూపించడం సబబైన పనికాదు. ఇవన్నీ ఆలోచించి, సెలక్ట్ కమిటీలో అవసరమైన మార్పులు చేసి, యీ బిల్లును సభ్యులందరూ ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:— ఎల్లుండి కూడా యీ బిల్లుపైన జనరల్ డిస్కషన్ ఉంటుంది. కాబట్టి యీ బిల్లుపై మాట్లాడటానికి చాలామందికి అవకాశం వస్తుందని నేను మనవిచేస్తున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి):— అధ్యక్షా, "లాండ్ సీలింగ్" అంటూ, యీ పేరుతోటి ఒక బిల్లు తెచ్చినందుకు కళా వెంకటరావు గారికి అభివందనాలు. ఆ పేరు మినహాయిస్తే, సీలింగ్ ఏమి ఉన్నదా, అన్న అనుమానం వస్తుంది. ఈ సీలింగ్ బిల్లుమీద ప్రజాభిప్రాయం అట్టే రాలేదు అని

ఎందుకు పెట్టటంలేదు?'' అని సాధారణంగా రైతులు అనుకోవటంలో ఎలాంటి తప్పు లేదు. శాసనసభ్యులుగా మేము యిక్కడ కూర్చుని మాట్లాడినది వినేకంటే, మంత్రులు పల్లెలకు పోయి, అక్కడ రైతాంగానికి ఉన్న అభిప్రాయాలు తెలుసు కుంటే, యిప్పుడు ఉన్న పరిస్థితి స్పష్టంగా తెలియటానికి అవకాశం ఉన్నది. ''ఆస్థిపరిమితి'' యీనాడు ఒక వర్గానికిమాత్రమే పెట్టటం జరుగుతుంది. ఆస్థిపరిమితి ఏ వర్గాని పెట్టారో, ఆ వర్గము యితర వర్గాలను చూసి అసూయపడటం జరుగు తుంది. దేశంలో ఒక వర్గం యితర వర్గాలను చూసి అసూయ పడే పరిస్థితులు ప్రభుత్వం కల్పించటం చాలా పొరపాటు అని నేను అనుకుంటున్నాను. ''యితర వర్గాలయొక్క ఆస్థులకు కూడా ఒక పరిమితి పెట్టబోతున్నామని, దానికి కేంద్ర ప్రభుత్వం కూడా ఒప్పుకున్నదని'' మొన్ననే ముఖ్యమంత్రిగారు చెప్పారు. ''భూమి ఆస్థి'' కి పరిమితి పెట్టినట్లుగానే, 'యీ ఆస్థుల పరిమితి' యితర ఆస్తులకు కూడా అనువర్తింప జేస్తారని నేను ఆశిస్తున్నాను ఈ నాడు పెద్దపెద్ద భూఖండా లన్నీ చిన్నచిన్నవిగా విభజింపబడుతున్నవి. దానివల్ల హెచ్చు ఆదాయం వస్తుందని, ఉత్పత్తి ఎక్కువ అవుతుందనీ అంటున్నారు. రష్యాలో జరుగుతున్నదానిని గురించి ఒక మిత్రుడు యీ విధంగా వ్రాశాడు.

"The transformation of Ruussian agriculture from individual ownership to the collectivised holdings and tillage because of the very speed of the process was accompanied by inordinate sacrifice of comfort substance and life yet without collective farm, Russia could never have fought as she has been fighting She would not have had the mechanical mindedness, the organisation the discipline and above all the food. In the writers judgment she should have lost the war."

అని ఒక మిత్రుడు ఒకపుస్తకంలో వ్రాశారు. నేను యిది ఎందుకు కోట్ చేసినానంటే, పెద్దపెద్ద కమతాలు ఉండి, శాస్త్రీయమైన పద్ధతులలో వ్యవసాయము చేసినపుడు, ఎక్కువ ఉత్పత్తి సాధించటం సాధ్యమవుతుంది అని ఆయన స్పష్టంగా వ్రాశారు. భూమిని చిన్నచిన్న ఖండాలుగా చేసి, అందరికీ పంచిపెట్టినంత మాత్రమున ఉత్పత్తి ఎక్కువ అవుతుందనీ, ఉత్పత్తి జరుగుతుందనీ నేను భావించటంలేదు. ఈ విషయాన్ని అందరూ ఒప్పుకుంటారని ఆశిస్తున్నాను. భూమి ఆస్తిమీద సీలింగు పెట్టినందువల్ల మామూలు రైతాంగంలో "నా భూమి తీసి, యితరులకు యిస్తున్నారు" అనేభయంతో కుటుంబంలో ఉండే పదిమందీ పంపకోవడం జరుగుతున్నది. అంటే ఒక కుటుంబంలోని పదిమందీ ఆ భూమిని చిన్న చిన్న ఖండాలుగా విభజించుకున్నారు అన్నమాట. ఈ విభజనను బట్టి, మామూలుగా సాఫీగా నడుస్తున్న కుటుంబం విడిపోయి, తగాదాలు పడిన

మంత్రిగారు అన్నారు. రాదు కూడాను. ఎందుకంటే. యీ బిల్లు వల్ల పోయేది లేదు, వచ్చేది లేదు. ఉన్న పొలాలు ఎవరికీ పోవు. అందువల్ల పొలాలు ఉన్న వారికి ఏ బాధా లేదు. భూమి లేని జనానికి ఎవరికైనా ఒక ఎకరం ఇస్తుందా అని ఆశిస్తే, వాళ్లకూ వచ్చేది లేదు. అందువల్ల జనానికి యీ బిల్లు ఉంచేనేమి, పోతేనేమి ? కాబట్టి యీబిల్లును గురించి ఎవరూ ఆలోచించిన వారు లేరు. అసలు లాండ్ సీలింగ్ ఎందుకు తీసుకు రావాలి ? "తెలంగాణాలో పెద్ద వ్యవసాయిక విప్లవం జరిగింది." అని ప్రతివారూ అనుకున్నారు. జవహర్‌లాల్ నెహ్రూ గారు ఇండోనీషియాలో మాట్లాడుతూ "తెలంగాణాలో ఒక పెద్ద వ్యవసాయక విప్లవం జరుగుతున్నది" అని చెప్పారు ఆ రోజున తెలంగాణాలోని రాజకీయ పార్టీలలో కొన్ని అభిప్రాయ భేదాలు ఉన్నప్పటికినీ, అన్ని పార్టీల వారుకూడా ఒక మినిమమ్ ఎగ్రిమెంట్‌కు వచ్చి, ఒక భూసంస్కరణల చట్టాన్ని చేశారు. అందరూ మినిమమ్ ఎగ్రిమెంట్‌కు వచ్చి చేసినటువంటిది తెలంగాణా ఆక్టు. ఆ ఆక్టును అమలు జరిపే పరిస్థితి యీ రోజున లేదు. ఆనాడు విశాలాంధ్ర వస్తే మనం అనేటువంటి వ్యవసాయ సంస్కరణలు (తెలంగాణా ప్రాంతంలో ఉన్నవి.) మొత్తము రాష్ట్రమంతా అమలు జరుప బడుతాయని తలంచాము. ఆంధ్రప్రాంతంలో ధనిక రైతు వర్గానికి బదులు (కాని, వాళ్ల బలంతోనే ఇవాళ ప్రభుత్వం నడుస్తున్నది.) తెలంగాణా లో ఉన్నటువంటి రైతాంగంయొక్క బలంతో వచ్చే ప్రభుత్వం ఉంటుందని ఆ బలం యొక్క ప్రయోజనం ఆంధ్రప్రాంతానికి కూడా వస్తుందని అనుకున్నప్పుడు, ఇవాళ అది విఫలం అయినందుకు చాలా నష్టం వచ్చింది. దానివల్ల విశాలాంధ్ర కావాలను కున్న సామాన్య జనం "ఇది ఏమిటి ? ధనికులయొక్క బలంతోటే, యీ ప్రభుత్వం నడుస్తుందా" అనే భయంలో పడుతున్నారు.

ప్రభుత్వం ప్రతి సంవత్సరము షుమారు నూరుకోట్ల రూపాయల విలువగల ధాన్యాదులను విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్నది. మనము ఆ నూరు కోట్ల రూపాయల ఖరీదుగల ధాన్యములను ఉత్పత్తి చేసుకోవాలి. వ్యవసాయోత్పత్తిలో పెరుగుదల కావాలి. ఈ పెరుగుదల కొరకు భూములకు తప్పకుండా సీలింగు రావాలి, జనాభాకు ఉపయోగపడే పరిస్థితి మనకు ఉండాలి అని ప్లానింగు కమీషను వారు చెప్పారు. అసలు భూములకు సీలింగు రావడములో ఉద్దేశ్య మేమిటంటే, ప్రభుత్వము ఏర్పాటు చేసిన కమిటీలు నాలుగు మాటలలో చెప్పారు అందులో మొదటిది "Meeting the wide-spread desire to possess land" అంటే ఎక్కువగా భూదాహము అనే దానిని తీర్చడము ; రెండవది : యిప్పుడు ఉన్న అసమానత్వమును సరిజేయడము ; మూడవది ; Agricultural Income లో మార్పులను గ్రహించడము ; తరువాత నాలుగవది ; Self-unemploy

ment ను create చేయడానికి కావలసినటువంటి భూమిని ఏర్పాటుచేయడము. ఈ నాలుగు సమస్యలు కూడా ప్రధానముగా తీసుకున్నారు. ఈ సమస్యలను పరిష్కరించటానికి Planning Commission వారు ఒక Pannel ను వేశారు. వారు దేశ వ్యాప్తముగ తిరిగి, పరిస్థితులన్నీ సమగ్రముగ విచారించి, యీ నాలుగు సమస్యలను పరిష్కరించి వేశారు. ఆ నాటినుంచి యీ నాటివరకు మనము కోరుతున్న National Income ఎంత అనే విషయమును పరిశీలించి, 'ప్రతి కుటుంబానికి 3,600 రూపాయలు నికరాదాయమును లెక్కవేసుకుని దానికి ఒక సీలింగు పెట్టినట్లయితే బాగా ఉంటుందని' వారు సూచించారు. అదే ప్రకారము పూర్వపు హైదరాబాదు ప్రభుత్వం ఏర్పాటు చేశారు. అలాంటి పరిస్థితులలో మనము యిక్కడికి వచ్చాము. ఇప్పుడు దానిని మార్చటానికి ప్రభుత్వం ప్రయత్నము చేస్తున్నందువల్ల అసలు ప్రధానసిద్ధాంతానికే వ్యతిరేకముగా జరుగుతున్నట్లు కనపడుతున్నది. ఈసీలింగు పెట్టడమువల్ల భూమి లేనటువంటివారికి భూమి యివ్వడానికి భూమి ఏమైనా మిగులుతుందా; లేదా అనే ప్రశ్న ఉత్పన్న మవుతున్నది. ఈ సీలింగువలన భూమి ఎంత మిగులుతుంది అని అడిగితే "ఒక లక్ష ఎకరములు మిగులుతుంది అది కూడా ఖచ్చితముగా మిగులుతుందనికాదు. మిగలవచ్చును" అని మంత్రిగారు చెబుతున్నారు. ఒక లక్ష ఎకరాలు మాత్రమే మిగలటానికి కారణమేమిటి అని అడిగితే దానికి రెండు రకముల కారణములు చెబుతున్నారు. ఈ రోజున ఒక్కొక్క కుటుంబానికి యిరువది అయిదేసి ఎకరముల చొప్పున లెక్కవేసి ఎంతమిగులుతుందో చూద్దామని ఉద్దేశ్యముతో ముందుగా ఆంధ్రప్రాంతములో లెక్కలు తీశారు. తరువాత హైదరాబాదు ప్రాంతములో కూడ లెక్కలు తీశారు. ఈ రెంటినీ సమన్వయముచేసి చూస్తే, భూమి ఉన్నవారికి 25 ఎకరాల చొప్పున యిచ్చివేసి, మిగతా భూమిని లెక్కకు తీసుకుంటే, ఆ విధముగా అందరిదగ్గరనుండి ఎంత భూమి అవుతుందని ఆలోచిస్తే, ప్రభుత్వానికి వచ్చిన లెక్కలలో చాలా పొరబాట్లు ఉన్నట్లు కనబడినప్పటికినీ, కనీసము పది లక్షల ఎకరాలకు తక్కువలేకుండా ఉండగలదని లెక్కలవల్ల తేలుతున్నది. ఈ ceiling ను గురించి శాసనము రాబోతోంది గదా అని వాటికి వివరాలు అవసరమని ముందుగానే ప్రభుత్వం రాష్ట్రములో భూ కమతాల లెక్కలు అన్నీ సేకరించారు. ఆ లెక్కలు పూర్తిగా రాలేదని తెలుస్తున్నది. కాని మొన్న రెవిన్యూ మంత్రిగారు యిచ్చిన figures ను బట్టి చూస్తే, అందులో 20 ఎకరాలకు పైన ఉన్నవారు ఎంతమంది ఉండగలరు అని లెక్కలు తెప్పించి చూస్తే, 20 ఎకరాలకు పైన ఉన్నవారు 1,90,755 మంది ఉన్నారని చెప్పారు. వీరికి ఉన్న భూమి మొత్తము అంతా ఎంత ఉన్నదని అడిగితే 88 లక్షల ఎకరాలు ఉన్నదని అన్నారు. వీరందరికీ ఒక్కొక్క కుటుంబానికి 20 ఎకరాల చొప్పున విడదీస్తే, మిగిలిన భూమి ఎంత ఉంటుందంటే 48 లక్షల ఎకరాలు surplus గా ఉండే అవకాశము

ఉంటుందని తెలుస్తున్నది. అందు వలన ఎకరముల ప్రకారముగా ceiling పెట్టేటట్లయితే పరిస్థితి ఎట్లా ఉంటుందంటే భూ దాహము తీర్చునటువంటి సంస్కరణలు, సంస్కరణలుగా మాత్రం పరిగణించటానికి వీలులేదు. ఈ లెక్కలు ఊరకనే కాగితముమీద పెట్టటానికి పనికి వస్తాయేమో కాని, భూ దాహము తీర్చటానికి practical గా చూస్తే అది అసలు సాధ్యముకాదు. కాబట్టి యిలాంటి లెక్కల వలన ప్రయోజనములేదు. అలాంటప్పుడు యీ సంస్కరణలు వస్తాయా, రావా, అనేది సామాన్య ప్రజానీకానికి పట్టడములేదు. భూమి ఉన్నవారికి భూమి పోదు గనుక వారికి అసలే పట్టడములేదు. ఇప్పుడు యీ సీలింగు వలన కొంత భూమి పోగా ఎంతమిగులుతుందని అడిగితే, ఏదో కొంత మిగులుతుందని అంటున్నారు కాని, అది యింత అని ఖచ్చితముగా చెప్పలేము. అది ఎంతో తేల్చుకోకుండా సీలింగు పెట్టినట్లయితే చాలా ప్రమాదము వస్తుంది. చివరికి అది ఏ విధముగా పరిణమిస్తుందో కూడా తెలియనటువంటి పరిస్థితిలో పడటము సంభవిస్తుంది. అందువలన భూ సమస్యమీద తీసుకునివచ్చే బిల్లు రోజుకు ఒక్కొక్కటి చొప్పున peace-meal గా తీసుకుని వస్తే, ఒకదానికొకటి సంబంధము లేకుండా, అటు రైతాంగానికీ, యిటు భూస్వాములకూ, ప్రభుత్వానికీ సంబంధము లేకుండా పోయి, ఆఖరుకు పరిస్థితి అంతా complications లోకి వచ్చి, confusion, విషమపరిస్థితి ఏర్పడే ప్రమాదము రాక తప్పదు. అది ఎటువంటి పరిస్థితి అవుతుందంటే, Estates Abolition Act, Inams, Estates Abolition Act విషయంలో ఏమి జరిగిందో మనకు పూర్తిగా తెలుసు. వీటి రెండింటినీ సమన్వయపరిచేటట్లుగా ఒకే సమగ్రమైన బిల్లును తీసుకుని రానందువలన, అంచెలంచెలుగా సవరణలు తీసుకుని వచ్చినందు వలన ఆ చట్టములు అతుకుల బొంతలుగా తయారైనాయి. ఒక్కొక్కసారి ఒక్కొక్క సవరణ తేవడము, దానిమీద ఏదో అనుమానము రావడము, తరువాత కోర్టులు విమర్శించడము, ప్రజలలో వివాదాలు, కొట్లాటలు సంభవించడము Inams, Estates Abolition Act విషయములో మనము చూస్తూనే ఉన్నాము. అందువల్ల దీనికి ఒక Comprehensive Bill ను తీసుకుని రాకుండా యిలాంటి బిల్లును తీసుకుని వచ్చారు ఇప్పుడు రెండు సమస్యలు ఉత్పన్నమవుతున్నవి. భూ దాహము ఉన్నవారికి భూమిని యిచ్చింది ఏమీ ఉండదు. తరువాత ఈ రోజున Tenant గా ఉన్నవాని ప్రస్తుతపు position ఏమిటో, వాడు యీ దినమున తన చేతిలో ఉన్న పొలము తనచేతిలోనే ఉంటుందో, లేదో కూడా తెలియని పరిస్థితి వస్తున్నది. పోనీ మిగతా పొలము అయినా ఆ Tenant కే వస్తుందా, లేదా అంటే అదికూడా అనుమానమే. ఏ విషయమైనను ప్రభుత్వం యిందులో వ్రాయలేదు. ఈ రెండు విషయాలు తేల్చనటువంటి యీ బిల్లువలన ప్రయోజనము లేదు. ఈ పరిమితి ఎవరు నిర్ణయించాలి అంటే, యీ బిల్లుప్రకారము R. D. O.

యే నిర్ణయించ వలసినట్లుగా ఉన్నది. ఈ విధానము సరియైనది కాదు. దీనికి ప్రత్యేకంగా ఒక కమిటీని వేయవలసిన అవసరము ఉన్నది. ఈ పరిమితి అనేది ఎవరు, ఎట్లా నిర్ణయించాలి అనేది ముందు settle చేస్తేనేగాని, యీ వ్యవహారం నడవదు. అందువలన మనము యీ రోజున ఏ సంస్కరణలు అయితే రైతాంగానికి ఉపయోగపడగలవని కోరుతున్నామో, మనము అధికముగ ఆహారధాన్యాలు పండించ టానికి ఏ పధకము అయితే వీలు అవుతుందో, అది వచ్చినప్పుడే భూ దాహము తీర్చగలమని గుర్తించాలి. ఆ విధముగా కాకుండ యిప్పుడు ప్రభుత్వం తెచ్చిన బిల్లు ప్రకారము అయితే, ఆహారోత్పత్తికి మన ఆంధ్రదేశములో యిది ఏవిధముగా నైనా ఉపయోగపడుతుందా అని అంటే ఉపయోగించదు అని తేలు తున్నది. నిన్నటి దినమున మంత్రిగారు మాట్లాడుతూ, ఆంధ్ర ప్రాంతములో ఉన్న రైతులు ఉన్నతమైన ఉత్పత్తి చేసి potential capacity ని సంపాదించ గలిగి నారని అన్నారు. potential capacity రైతాంగానికి ఎప్పుడైతే ఉంటుందో అప్పుడు intensive cultivation కోరుతున్నారు కాని, వారికి extensive cultivation అక్కరలేదు. extension cultivationఅనే దానితో అవసరమేవుండదు. అందువల్ల వీలయినంతవరకు intensive cultivationకు తోడ్పడే పధకము మనము తీసుకుని రాగలిగినప్పుడు extensive cultivation అసలు చాలాతక్కువగానే ఉన్నప్పటికినీ, ఫరవాలేదు. ఎక్కడనో పోలెండు వగైరా దేశాలలో 140 ఎకరాలు, 150 ఎకరాలు ఒకయూనిట్‌గా ఏర్పాటుచేశారని చెప్పారు. అలాంటి పరిస్థితిని యిక్కడకు తీసుకుని రాలేదు. తీసుకుని రానవసరము లేదని యీ బిల్లును బట్టి ఖచ్చితముగ కన్పిస్తున్నది. అందువలన intensive cultivation చేయటానికి పరిస్థితి ఉన్నప్పుడు ఉన్న భూమిని ఎంత ఎక్కువ మంది చేతులలో పెట్టితే అంత ఎక్కువగా intensive cultivation చేయగలుగుతామని, ఎక్కువగ ఆహార ధాన్యాలను పండించ గలుగు తామని చెప్పటానికి వీలు అవుతుంది. ఆంధ్రప్రదేశ్ అనే పత్రికలో పైడి నరసింహ అప్పారావుగారి ఫొటో కూడా వేశారు. వారు చాలా పెద్ద ఎత్తులో ఉత్పత్తి చేయ గలిగినారని, ఆయనపేరు యితర రైతులకు గూడా తెలిసేటట్లు ఆయన ఫొటో వేసి ప్రకటింపజేశారు. ఏడువేల పౌనులో, ఎంతో, చాలా పెద్ద మొత్తముగల పౌనుల ధాన్యము ఉత్పత్తిచేశారట. అందరికంటే ఎక్కువ మొత్తము చేయగలిగినారట. అదేమాదిరిగా అందరూకూడ ప్రయత్నించటానికి వీలు కాకపోయినా, కొంతవరకైనా intensive cultivation అవసర మవుతుంది. అందరు కూడా maximum ను reach అవుతారని కాదు. కాని, ఆవిషయములో ప్రయత్నము చేయటానికి intensive cultivation ద్వారా దోహద మివ్వాలి. కావలసినంత Potential Capacity రైతాంగములో కన్పిస్తున్నది. రైతాంగానికి పంచుదామని ప్రభుత్వము అనుకుంటున్న భూమిని ఎక్కువ మందికి పంచేటట్లయితే Potential Capacityని

పెంచటానికి, intensive cultiv tion చేయటానికి అవకాశము ఉంటుంది. కనుక వారికి కొద్ది భూమి అయినా కావాలి. కాని, ఆ భూమి మాత్రము దీనివలన వస్తున్నదా అని అంచే రావడమే లేదు. ఇదివరకు అవకాశము యిచ్చినటువంటి తెలంగాణాప్రాంతములో భూ సంస్కరణల బిల్లు అమలు జరగడములేదని అంటున్నారు. ఆ సంగతి అందరము కూడా అంగీకరిస్తాము. అందులో ఉన్న provisions అన్నీ మంచివే. కాని అది అమలు జరగడము లేదంటే, అమలు జరపవలసిన బాధ్యత ప్రభుత్వము మీదనే ఉన్నది. అది అమలు జరగడము లేదని అంటే, యిక దానివలన ప్రయోజనము లేదని, దీనికీ, దానికీ లంకె పెట్టుదామని అంటే ఎంతకాలమునుంచో యీ భూ సంస్కరణలవల్ల లాభం పొందుదామని ఆశించుకుని కూర్చున్న రైతాంగము నిరాశ చెందటానికి కారణమవుతుంది. తరువాత వివాదాలకు దారితీసే అవకాశము ఏర్పడుతుంది.

తరువాత యిప్పుడు యీ బిల్లుద్వారా 5,400 రూపాయలు నికరాదాయము గరిష్ఠ పరిమితిగా నిర్ణయిస్తున్నామని చెప్పుతున్నారు. అది యీ బిల్లులో కూడా వ్రాశారు. ఈ మొత్తమును దేనిమీద ఆధారపడి నిర్ణయించారు అని అడిగితే, దానికి మంత్రిగారు ఒక్కటే సమాధానము చెప్పారు. గత మూడు సంవత్సరముల ఆ దా య ము, గ త ప ది సం వ త్స ర ము ల ధా న్య పు ధ ర యీ రెంటినీ లెక్కలోనికి తీసుకొనివచ్చిన యీ average మీద ఆధారపడి నిర్ణయము చేశామని అన్నారు. కాని దీనిని గురించి ఒక్క విషయము చెప్పవలసి ఉన్నది. రెవిన్యూ మంత్రిగారు యిటీవల Radio speech యిస్తూ తెలంగాణా సీలింగుకున్నూ యిప్పుడు యీ బి ల్లు ద్వా రా యేర్పడబోతున్న సీలింగుకున్నూ ఉన్న తే డా ను గురించి చెప్పారు. వారు చెప్పినది ఏమిటంటే అప్పటి ధరలకును, యిప్పటి ధరలకును చాలా తేడాలు ఉన్నవి గనుక, యీ ధరలను సమన్వయపరచడానికి రూ3,600 నుంచి 5,400 వరకు సీలింగు పెట్టడములో ధరల ప్రాతిపదిక ఒకటి ప్రధానముగా ఉంటుందన్న ఉద్దేశ్యముతో ఆ విధముగ నిర్ణయించడము జరిగిందన్నారు. ఆ speech మనము అందరము విన్నాము. అందువల్ల యీ ప్రాతిపదిక అంతా దేనిమీద ఆధారపడిఉన్నదంటే. ధరలు పెరగటానికి వీలుఅయిన ప్రాతిపదికమీద ఆధారపడిఉన్నదని తేలుతున్నది. ఈనాడు దేశములో ఉన్న economic basic understanding అంతా దేని మీద రావాలనిఅంటే ఆహార ధాన్యాలకు సంబంధించిన ధరలను ఒక స్థాయిలో నిలబెట్టితే తక్కినవాటిని కూడా control చేసినట్లయతే, తక్కిన విధానము అంతా contro చేసే పరిస్థితికి ప్రభుత్వం రాగలుగుతుంది. అది చేయకుండా దానికి అంతులేకుండా పెంచుతూపోతే, దానితోబాటు అన్నీ కూడా పెంచుతూపోతే రావణాసురుని సభలో

ఆంజనేయులువారు లోకనుపెంచిన విషముగా అది అంతులేకుండా పెరుగుతూ ఉంటుంది. ఆవిధముగా ధరలు కూడా పెరిగితే లాభము లేదు. అందువల్ల అవి ఒక ప్రాతిపదికమీద జరుగవలసియున్నది. ఈనాడు మిత్రులందరు? యీ సీలింగు ఒక్క ఆహారధాన్యాదులకు సంబంధించి ఎందువల్ల పెట్టుతున్నారు? వ్యక్తులకు వచ్చే యితర ఆదాయముమీద కూడా సీలింగు ఎందువల్ల పెట్టడములేదు? అని అడుగుతున్నారు. ఇది మన ఒక్క దేశములోనే కాదు. ఎక్కడైనా సరే ధరలు పెరగడమనేది యితర దేశములలో కూడా ఉన్నది ఎక్కడెక్కడైతే భూమి మీద, ఆహారధాన్యాల ఉత్పత్తి హెచ్చుతగ్గులమీద ధరలు ఆధారపడి ఉంటాయో, వాటితో పాటు యితరవాటికి కూడా చుట్టుప్రక్కల పెరుగుతూ తగ్గుతూ ఉంటాయి. ధరలు ఎప్పుడైతే పెరిగినవో, లేబరుకూడా కూలీరేటు పెంచి ఎక్కువగ యివ్వమంటున్నారు. అదేమాదిరి ఉద్యోగస్థులు జీతాలు పెంచమని అంటున్నారు. అదేవిధముగ అన్ని రంగములలోను హెచ్చురేట్లు కోరుచున్నారు. అన్నిచోట్లనూ హెచ్చుగా యిస్తున్నప్పుడు మాకు మాత్రము ఆహారధాన్యాలకు ధరలు ఎందువల్ల తక్కువచేయాలి, మాకుకూడా ఖర్చులు హెచ్చుగా అవుతున్నవి గనుక, ధరలు బాగా పెరగనివ్వండి అని రైతాంగం కోరుచున్నారు. ఈ Base అంతా సరిదిద్దాలని అనుకుంటే యీ Base ను ఎక్కడో ఒకచోట ఒక flooring మీద ఉండేటట్లు చేయాలి. ఈ flooring ఎక్కడ ఉండాలి. అంటే యిది ప్రధానంగా ఆహార ధాన్యాలకు సంబంధించి ఉన్నది గనుక, వాటియొక్క ఉత్పత్తి వినిమయములో ఉత్పత్తి ఎక్కువ చేయటానికి ప్రాతిపదికగా ఉండటానికి అవసరమైన ప్రయత్నము చేస్తే బాగాఉంటుందనే ఉద్దేశ్యముతో రావలసిందికాని, దానికి వ్యతిరేకముగ మాత్రము జరుగుతున్నదని మిత్రులందరికీ మనవి చేస్తున్నాను.

తరువాత ధరలు నిర్ణయించేటప్పుడు ఒక్క విషయము మాత్రమే నేను చెప్పదలచుకున్నాను. మొదటిది: అసలు 3,600 రూపాయలకు మించకూడదు. తరువాత ధరలు నిర్ణయించేటప్పుడు పది సంవత్సరముల సగటు అక్కరలేదు. ఆ మూడు సంవత్సరముల average తీసుకుంటే సరిపోతుంది అని నా అభిప్రాయం. రెండవది: బీళ్ళ విషయములో యిప్పుడు ఉన్న విస్తీర్ణమునకు యింకా అదనముగా 1/3 ఉంచవచ్చునని అంటున్నారు. ప్రస్తుతము ఉన్నబీళ్ళేచాలు. ఇకమీదట పెంచవలసిన అవసరము లేదు. మూడవది పంచదార ఫ్యాక్టరీలకు exemption ఇచ్చియుము. ఆ ఫ్యాక్టరీలకు సంబంధించి భూములు ఉన్నవి. ఈ భూములకు కూడా సీలింగు ఉంటుందా అని అంటే "యిది అన్నింటికి కాకుండా ఒక్క బోధన్ షుగర్ ఫ్యాక్టరీకి సంబంధిస్తుందనే అభిప్రాయముతో ఉన్నాను. అదికూడా మార్చటానికి నాకేమీ అభ్యంతరములేదు" అని మొన్నటిదినమున కౌన్సిలులో ముఖ్యమంత్రి గారు చెప్పారు. బహుశ యీ విషయమును drop చేస్తారేమోనని అనుకుంటున్నాను.

పండే పంటలో ఎవరెవరికి ఎంత యివ్వాలో నిర్ణయించేటప్పుడు వ్యవసాయదారునికి ఆదాయం ఎంతవస్తున్నది? ఆ tenant యొక్క ఆదాయం ఎంత? Owner యొక్క ఆదాయం ఎంత? ఈ తరతమ భేదాలన్నిటినీ సమానంగా చూడాలి కేరళ బిల్లులో ఒక ప్రాతిపదిక ఉన్నది. "ఎవరియొక్క ఆదాయాలు ఎంత ఉన్నాయో వాటినికూడా సమంగా ఆలోచించుకొని నిర్ణయించేటటువంటి పద్ధతి రావాలి" అని చెప్పారు. ఒక్కొక్క సంవత్సరంలో tenant ధనవంతుడుగా ఉంటాడు. రైతు బలహీనుడుగా ఉంటాడు. ఒక సందర్భంలో owner బలవంతుడుగా ఉంటాడు. tenant బలహీనుడు ఉంటాడు. మనం 'equality' అనే న్యాయసూత్రాన్ని గుర్తిస్తున్నాం గనుక వాళ్ళిద్దరూ సమాధానపడే విధంగా కూడా యిప్పించి ఉన్నారు. ఇదే కేరళ బిల్లులో ఉన్నది.

Compensation అనేది ఎందుకు యివ్వాలి? అని ప్రశ్న. దానికి జవాబు "Com lensation లో ఉన్నది. మనమేమిచేస్తాము" అని బొబ్బిలి రాజాగారు బిల్లు తీసుకుని వచ్చినప్పుడు ఒక సంవత్సరం ఎంత ఆదాయము వస్తుందో అదే Compensation క్రింద యిస్తున్నాము అని చెప్పారు. దానిని Supreme Court కూడాఅంగీకరించింది.

(Srimathi T. Lakshmikantamma in the Chair)

Compensation యివ్వడమే ప్రధానం అయితే ఒక సంవత్సరం ఆదాయం compensation క్రింద యివ్వవచ్చు. పెద్ద పెద్ద వాళ్ళకు మరీ తగ్గించవచ్చు. అందువలన మొత్తం యీ బిల్లుకో ప్రాతి పదికలన్ని మార్చాల్సినటువంటి అవసరం ఉన్నది. ఇది complicating Bill కాని, comprehensive Bill కాదు. మా సంస్కరణలు తీసుకొచ్చి జాబితాలో ఉంచాము అనే సంతృప్తితో కాకుండా నిజమైనటువంటి సంస్కరణలు తీసుకువచ్చి ఆ సంస్కరణలకు ఆంధ్రప్రదేశ్ నాయకత్వం వహించాలని కోరుతూ నేను ఈ బిల్లు ప్రాతిపదికను వ్యతిరేకిస్తున్నాను.

*Sri J. Chandramouli (Ammanabrole)*:— Mr. Speaker, Sir, I rise to support the Bill. I congratulate the hon. Minister for Revenue for bringing forth this Bill in a very able manner. He seems to have taken great pains in trying to make this a model Bill to be followed by the other States.

But in his enthusiasm to be the first one to introduce this Bill, he seems to have leaned a little more to the left than to the right. Our Chief Minister has often said both in public and in private that it is not the policy of his Government to rob Peter to pay Paul. Going through the Bill, I feel that

Peter has been robbed a little. When we are dealing with such momentous problems as this Bill envisages, one should be fair to one and all, but here, as I have already said, the leaning is towards the left and the left has been given a little prominence.

Coming now to the Bill proper, I feel that Section 6 requires re-consideration. This Section relates to determination of net income of holding. The Officer who determines the net income is the Revenue Divisional Officer. For this purpose, the Revenue Divisional Officer shall estimate the gross income of the lands in the holding with reference to the average annual gross yield of the land during a period of three years immediately befeore the date of receipt of the declaration. I feel, Sir, that, in calculating the net income, it is not fair that is should be based on the average annual gross yield of the land for a period of three years immediately before the date of receipt of the declaration furnished under Section 5 of the Bill. On account of the Grow-More-Food campaign etc., no doubt, the yield has risen a little during the past few years. But that is not going to be a permanent feature. That apart, we know from our experience that people are using chemical fertilisers for increased food production; but it is common knowledge that after some time the land has a tendency to become alkaline and the yield drops down gradually. It is therefore not fair to take the preceding three years' gross yield of the land only into account. From 1947 onwards on account of the Grow-More-Food Campaign, cultivation has been made intense; people have been largely using these chemical fertilisers; and the yield has gone up. I therefore feel that when we take the gross yield as the basis for determination of net income, we should take the yield for a period of ten years from 1947.

As regards the price, the Clause says that it should be the average of the prices prevailing during the period of ten years before such date. Here again, the same argument stands good, because on account of war conditions and fluctuations and the partition in our own country, the yield in other places has gone down; and due to shortage of paddy and other foodgrains, the prices have naturally risen a little. We are now going to settle down conditions once again. There is no guarantee that the prevailing high prices are going to be a permanent feature. When we are fixing that the income should not be more than

Rs. 5,400, if the Government gives a guarantee that every ryot who produces foodgrains will get Rs. 5,400, then we need not depend upon all these things. Again, some crops may yield more and some crops would yield less. When therefore we are determining the yield, I feel that the fair way would be that we should take only paddy for wet lands and cholam for dry lands. These should be the standard crops, and on these the prices and the yield should be computed, and with reference to that, the net income may be determined.

The Bill says that fifty per cent of the gross income so arrived at (as laid down in Clause 6) shall be deemed to be the net income of such holding. Yesterday, the Leader of the Opposition, Shri P. Sundarayya, was saying that in Guntur and Krishna Districts, cultivation expenses are not more than 25 per cent. I do not know, and I have little experience; but I think that estimate is far from correct. Actually where intensive cultivation is made, the expenses are more than 60 per cent. Take for instance tobacco. People who do not know anything about tobacco merely feel that, on account of the high prices, people growing tobacco are making a lot of money; but actually for tobacco crop, I think that 25 per cent of the gross income is the net income. Same is the case with regard to other crops too. Therefore, I think the proper thing would be to fix 40 per cent of the gross income as the net income.

The other point I would like to suggest is regarding compensation. Here, compensation is being paid only upto 25 per cent of the market value, based on ten times the net income. I think this is very unfair. An acre of land which yields 15 bags of paddy is being sold at Rs. 4,000 or Rs. 5,000, but the compensation that we pay under this Bill may come to Rs. 900 or Rs. 1,000. Let us see the compensation that the Central Government pays: When the Central Government nationalised the Imperial Bank of India, they have paid 4 or 5 hundred per cent more on the share value to the shareholders. Similarly when they nationalised the Reserve Bank of India, they paid Rs. 140 per share of Rs. 100. That being so, I do not know why land belonging to poor agricultural class should not get even the market value or even 75 per cent of the market value. I feel that the provision made in this regard in the Bill is unfair. I also feel that the slab system in compensation is not crimination at all fair. There is a lot of discrimination

made now, by virtue of the slab system provided in the Bill, and I suggest that this slab system should go, and an average rate of compensation should be paid to all.

Thank you very much for the opportunity given

శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం-రిజర్వుడు):—అధ్యక్షా, ప్రభుత్వం యింత త్వరలోనే యీ భూసంస్కరణల బిల్లును తెచ్చినందుకు వారిని అభినందించక తప్పదు. కాని, యీ తరుణంలోనే యీ బిల్లు పేద ప్రజానీకానికి విచారాన్ని కల్గిస్తోందనికూడా చెప్పకతప్పదు. సీలింగు పెట్టడంలో 5,400 నికరాదాయమంటే భూమి 500 ఎకరాలు ఉండవచ్చు, లేదా వేయి ఎకరాలు ఉండవచ్చు. వాటికి లెక్కలు కట్టే అధికారం ఆర్. డి. ఓ. లకు యిచ్చారు దీనివల్ల వారికి ఒక పెద్ద అధికారం వచ్చిందని నేను అనుకుంటున్నాను. ఆర్. డి. ఒ. లు వారికి సదుపాయాలు చేసినవారికి తక్కువ భూమి, ఆదాయం ఉన్నట్లుగా లెక్కలు వ్రాస్తారని నాకు అనుమానం. కాబట్టి, వారికి యింత పెద్ద అధికారాన్ని యివ్వడం మంచిదికాదని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

30 ఎకరాలనుంచి 50 ఎకరాల వరకు అట్టేబెట్టుకోవచ్చును అని లక్కరాజు సుబ్బారావుగారి కమిటీ రిపోర్టులో ఉన్నదనుకుంటాను. కనీసం 30 ఎకరములయినా ప్రభుత్వం ఒక పరిమితి నిర్ణయించడం అవసరం. మెట్టభూమి అయితే 100 ఎకరాలు ఉంచడం కూడా చాలా అవసరం. అట్లాగయితేనే బాగుంటుందని నా ఉద్దేశం. ప్రభుత్వంవారు భూముల లెక్కలు తీసుకోవడం జరుగుతోంది. అలా కాకపోతే, 5 మందిని ఒక కుటుంబంగా భావించి, 200 రూపాయలు శిస్తు కట్టే వానిని రైతుగా భావించి నిర్ణయించినట్టయితే చాలా సంతోషంగా, అందరికీ ఆమోద కరంగా ఉంటుందనుకుంటాను. భూములకు పరిమితులు పెట్టడం చాలా అవసరమని ప్రజలు భావిస్తున్నారు. ఎంతోకాలం నుంచి భూమి దున్నుకునే వారికే భూమిపై హక్కు యిస్తామని కాంగ్రెసు, తదితర పార్టీలు కూడా ప్రచారం చేశాయి. ఇప్పుడు యీ ప్రభుత్వంవారు దున్నేవానికే భూమిపై హక్కు కలిగించుతారని ఆశిస్తున్నాం. విజయనగరం మహారాజా, బొబ్బిలి మహారాజాల వంటి వారికి ఒక్క సెంటు భూమి అయినా పోదు, అని ప్రజలు గ్రామాలలోనూ, రైళ్ళలో కూడా అనుకుంటున్నారు. సీలింగ్పు ఖర్చును బట్టి గాని, చెల్లించే శిస్తునుబట్టిగాని చేయడం చాలా అవసరం. మహారాజులు, జమీందారులు వారి జమీందారీలు పోయినప్పటికీ, పెద్దపెద్ద ఫ్యాక్టరీలు కట్టుకున్నారు. వ్యాపారాలు చేస్తున్నారు, బాగా డబ్బు సంపాదించు తున్నారు. జమీందారీలు పోయినవారు—భూమి లేకపోయినప్పటికీ యినుము, సిమెంటు మొదలయిన వ్యాపారాలు, బట్టల వ్యాపారం చేస్తూ డబ్బు సంపాదించు

తున్నారు. పంటలు పండించడానికి రైతులు నిజంగా చాలా కష్టపడవలసిఉంటుంది. అలాంటి రైతులకు మనం మేలుచేయడం మంచిది. నిజమైన రైతులకే ప్రభుత్వం మేలు చేయాలి. షుగర్ ఫ్యాక్టరీలు ఉన్న రైతులను దృష్టిలో పెట్టుకొని 500 ఎకరములు అని నిర్ణయించకూడదు సామాన్యమైన రైతును దృష్టిలో పెట్టుకొని నిర్ణయించాలి. నేను ఒక సామాన్య రైతును. ఒక కుటుంబానికి ఎంతభూమి ఉంటే సరిపోతుందో నాకుతెలుసు. నాకున్న 5 ఎకరాల భూమితో 15 మంది కుటుంబంతో మేనేజి చేసుకుంటున్నాను. పిల్లల చదువులు, గౌరవ మర్యాదలు అన్నీ చూస్తున్నాను. నాకు ఏ ప్రభుత్వంకూడా తగిన సహాయం చేయలేదు. దీనికి ఒక దృష్టాంతరం చెబుతాను. 5 ఎకరాల భూమిలో ఎకరం ఒక్కింటికి 30 బస్తాలు పండించినానని శ్రీ నరసింహప్పారావుగారు చెప్పారు. దానిని నిదర్శనంగా తీసుకోవడం న్యాయంకాదని నేను చెబుతున్నాను. మరి వారు ఎట్లా పండిస్తున్నారో: వారికి ఒక మిల్లు ఉన్నది, ఒక సినిమాహాలు ఉన్నది. వాటిల్లో వచ్చిన సొమ్మును ఎరువుల రూపంలో భూమిలో పెడుతున్నారు కాబట్టి పండించగలుగుతున్నారేమో. భూమిలో పెంటమన్ను, పశువుల పేడ మొదలైనవి వేసి పంటలు పండించినవాడే నిజమైన రైతు. అటువంటి రైతులకే యీ సంస్కరణలు ఉపయోగించాలి. కొంత మందికి భూమి అంటేనే అసహ్యం. అటువంటివారికి భూములు యివ్వనక్కరలేదు. ఎక్కువ డబ్బు పరిశ్రమలలో ఖర్చుపెట్టవచ్చును. ప్రజలందరికీ చదువులు చెప్పించడానికి వినియోగించవచ్చును. భూమి అక్కరలేదనేవారికి ఎక్కువ చదువులు చెప్పించి, మాబోటివారికి చదువులుచెప్పే మాస్టరులుగా వేయండి. భూమిని ఆశ్రయించుకొని ఉన్నవారికి భూములు యివ్వండి. హరిజన కూలీలు, రైతుకూలీలు పల్లెటూళ్ళలో చాలా మంది భూమిమీదనే ఆధారపడినవారున్నారు. ఒక్క సెంటు భూమిలో పంట పాడైపోతే ఆ పేదకూలీ బాధపడుతాడు. అలాంటి వారికి 1,2 ఎకరాల భూమి అయినా యీ సంస్కరణలవల్ల ముట్టేటట్లు చూడాలని మనవి చేస్తున్నాను.

నికరాదాయమును నిర్ణయించే అధికారం ఆర్. డి. ఓ. లకు యివ్వకూడదు. వారి అధికారాన్ని తగ్గించాలి. పూజ్యులు మంత్రిగారు షుగర్ ఫ్యాక్టరీలున్నవారికి చాలా సదుపాయం చేశారు. వారిభూమి ఒక్క సెంటుకూడా పోదని ప్రజలు అనుకుంటున్నారు. ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్‌లో కూడా అనుకుంటున్నారు. వారికికూడా యీ బిల్లు వర్తించేటట్లుచేయాలి. పూజ్యులు, ఏకైక నాయకులు అయిన సంజీవరెడ్డి గారు యీ విషయంలో ప్రయత్నిస్తామనికూడా చెప్పారు. మన ప్రతిపక్షనాయకులు శ్రీ సుందరయ్యగారు 12 వేల రూపాయలు కనీస నికరాదాయంగా ఉండాలన్నారు.

సుందరయ్యగారు, చంద్ర రాజేశ్వరరావుగారు సోషలిజం విషయంలో ప్రస్తావించు తున్నారు వారికి నాహృదయపూర్వక ధన్యవాదాలు

శ్రీ కె. ఎల్. నరసింహారావు:— 12 వేలు సీలింగు కావాలని శ్రీ సుందరయ్యగారు అడగలేదు ఇతరత్రా 12 వేల రూపాయల ఆదాయం వచ్చే వారికి భూమివద్దు అన్నారు. అంతేకాని సీలింగు 12 వేలకు ఉండాలని అనలేదు.

శ్రీ పి. గున్నయ్య:—అన్నారు. రికార్డు అయ్యేఉంటుంది. దానిని ఎవ్వరూ దాచ లేరు. రేపు ప్రచారానికి వెళ్ళినప్పుడు వారు, మేము, అంతాకూడా యీవిషయం చెబుతాం. 1962 వచ్చేసరికి మళ్ళా మనమందరం ప్రజలముందుకు వెళుతున్నాము. ప్రతి వ్యాపారస్థునికి, ప్రతి మిల్లు ఓనరుకు, సినిమా ఓనరుకు, వేయిరూపాయలవరకూ లాభాలు వస్తాయి. ఈ విషయాలన్నీ ప్రభుత్వదృష్టిలో పెట్టుకోవాలి. రైతులకు ఏ విధంగాను నష్టం కలగనిరీతిగా దీనిని అమలు చేయాలి. ప్రభుత్వానికి మూల స్తంభము వంటివాడు రైతు. రైతు లేకపోతే ప్రభుత్వానికి ఆదాయమే లేదు. ప్రభుత్వం రైతుకు రక్షణ యివ్వాలి. ప్రభుత్వం రైతులకు చేసే సహాయం సరిగా అందుట లేదు. దీనికి ఒక దృష్టాంతము చెబుతాను. ప్రభుత్వంవారు రైతులకు యివ్వమని వేలకొలది రూపాయలు యిస్తున్నారు. వారికి నా ధన్యవాదాలు. ఎడ్లు కొనుక్కోడానికి 500 రూపాయిలు యిస్తే, ఆఫీసరుల ద్వారా రైతులకు చేరేటప్పటికి 300 రూపాయలే అవుతున్నాయి. అయితే, యీ డబ్బు ఏమి అవుతోంది? ఎంక్వయిరీ చేయించమని పూజ్యులు రెవిన్యూ మంత్రిగారికి ఎన్నిసారులు చెప్పినా చేయకుండా ఉన్నారు. నేను అనేక దఫాలు చెప్పినాను. జిల్లా ఆఫీసరులను 6 మాసాలకు ఒకసారి హైదరాబాదులో సమావేశపరచి జిల్లాలలోజరిగే కార్య కలాపాలను, కష్ట నిష్ఠూరాలను పరిశీలించాలని మంత్రిగారిని కోరుతున్నాను. ప్రభుత్వంయొక్క మంచి ఉద్దేశాలను, సదుపాయాలను కలెక్టరులద్వారా ప్రజలందరికీ అందజేయాలని కోరుతున్నాను. ఆ విధంగా యీ ప్రభుత్వం చేయక పోతున్నందుకు నేను విచారపడుతున్నాను. దీనికి ఒక దృష్టాంతం చెబుతాను గత సంవత్సరం మా జిల్లాలో పంటలు పోయినాయి. ఈ సంవత్సరం కూడా యింతవరకు వర్షాలు లేవు. 'గత సంవత్సరం వర్షాలు పడని ప్రాంతాలలోనే యీ సంవత్సరం కూడా యింతవరకు వర్షాలు లేవు క్రిందటి సంవత్సరం పంటలు పండనివారికి ప్రభుత్వం 5000 రూపాయలు యివ్వాలని నిశ్చయించింది. అందుకు వారికి నా ధన్యవాదములు.' అయితే ఆఫీసరులు ఆ డబ్బును ఖర్చుచేయకుండా మరల ప్రభుత్వానికి పంపించేస్తున్నారు. దీనికి కారణమేమో తెలియకుండా ఉన్నది. ప్రభుత్వంచేసే ఘనకార్యాలను ప్రజలకు చెప్పుకోవలసిన బాధ్యత ప్రజా ప్రతినిధులమైన మా పై ఉన్నది కదా. ఇందుకు

చక్కటి అవకాశమును కలుగజేయ వలెనని శ్రీ కళా వెంకట్రావుగారిని, ప్రతిపక్ష నాయకులు శ్రీ సంజీవరెడ్డిగారిని వినయపూర్వకంగా ప్రార్థిస్తూ, యీ అవకాశం యిచ్చిన మిమ్ములను హృదయపూర్వకంగా అభినందిస్తూ, నేను యింతటితో సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి:— అధ్యక్షా, కురుక్షేత్ర సంగ్రామానికి ముందు పాండవ, దుర్యోధనాదులను శ్రీకృష్ణ పరమాత్మ అడుగుతాడు "మీకు నేను కావాలా; నా సైన్యం కావాలా?" అని. అది ద్వాపరయుగం కాబట్టి కృష్ణపరమాత్మ సాహాయ్యం వహించిన పక్షమే గెలిచింది. అలాగే శ్రీ కళా వెంకట్రావుగారు మా ప్రక్క-నున్నప్పటికీ చట్టం మాత్రం భూస్వాముల ప్రక్క పెట్టారు. ఇది కలియుగం గనుక వెంకట్రావుగారు మా ప్రక్కన వున్నా ప్రయోజనం మాత్రం భూస్వాములకే దక్కినట్లుగా ఉంది. భూస్వామ్యాన్ని సంస్కరించేముందు వారు భూస్వాములనే సంస్కరించారు. తీరా చట్టం తెచ్చిచూస్తే, కంచుకాగడా వేసి వెదకినప్పటికీ భూమి ఏమీ దొరకకుండా పోయింది. ఏనుగ వెలగపండును మ్రింగితే, వెలగపండు అలాగే వుండగానే లోపల గుజ్జుమాత్రం మాయమవుతుంది. అందుకనే నేను ఈ సంస్కరణలు 'కరిమ్రింగిన వెలగపండు వలెను, మేడి పండు వలెను' వున్నవని క్రిందటిసారి మనవి చేసి వున్నాను.

ఇందుకు మరొక ఉదాహరణ కూడా చెబుతాను. పరమేశ్వరుణ్ణి భక్తుడు ఈవిధంగా ప్రార్థించాడు "సాంబశివా! విష్ణుమూర్తి నీ శరీరంలో సగం భాగం గ్రహించాడు; తక్కిన సగభాగం పార్వతీదేవి ఆక్రమించింది; తలపైన చంద్రుడు ఆకాశానికి జారుకున్నాడు; గంగ సముద్రంలోకి ప్రవహించింది; నాకు మాత్రం నీ చేతిలోని భిక్షపాత్ర మిగిలింది." అని ప్రార్థించాడట. అలాగే సిద్ధాంతాలు, పద్ధతులు అన్నీ యీ చట్టంలో మిగిలిపోయాయి. భూమి మాత్రం భూ కామందుల చేతిలోకి వెళ్ళిపోయింది. ఉపన్యాసాలు మాత్రం వేదికలమీద జరుగుతూనే ఉన్నాయి. రైతాంగానికి మాత్రం అక్షయపాత్ర మిగిలింది. అందువలన రెవిన్యూ శాఖామాత్యులకు యీ సందర్భంలో ఒకవిషయం గుర్తుకు తీసుకు రాదలచాను. ఒకప్పుడు వారు 'సాంఘిక సంక్షేమానికి, ఆర్థిక న్యాయానికి, భూసంస్కరణలనేవి వివాహంలాంటిది' అన్నారు. ప్రకటనలలో మాత్రం ఆ రెంటికీ వారు వివాహం చేశారు కాని, బిల్లు తెచ్చిన తరువాత మాత్రం ఆ రెంటికీ విడాకులు యిచ్చారని నేను మనవి చేస్తున్నాను.

ఇక సీలింగు పెట్టేముందు ఒక ముఖ్యమైన విషయం ఆలోచించాలి. భూస్వాముల తాలూకుగాని, రైతాంగం తాలూకుగాని, ప్రత్యక్ష స్వాధీన హక్కు-అనుభవంలో సాగు అవుతున్న భూమి ఒక రకం; absentee land-lords

స్వాధీనంలోవున్న భూమి మరొక రకం. ఈ విధంగా మొత్తం భూమిని మనం రెండు రకాలుగా విభజింప వచ్చును. కేవలం స్వంత సేద్యంలోవున్న భూమికి సంబంధించిన మేరకు యీ చట్టాన్ని అనువర్తింప జేస్తూ, భూమిని దున్నకుండా భూస్వాధీనమును కలిగివున్న absentee land-lords కు ఆ భూములపై వారి హక్కులను ముందు రద్దు చేయవలసిందిగా నేను కోరుతున్నాను. వీరివద్ద కౌలు దార్లుగా పనిచేస్తున్నవారిని రక్షిత కౌలుదార్లుగా పరిగణించి, అవకాశం కలిగిన వెంటనే వారు ఆ భూములను కొనుక్కునే సావకాశం కల్పించవలసిందిగాను, యీ సూత్రాన్ని గమనింప వలసిందిగా ప్రభుత్వాన్ని కోరుచున్నాను. అందరికీ యిచ్చినట్లుగానే right of resumption వీరికి కూడా యివ్వాలను కున్నట్లయితే అదికూడా మంచి ఉద్దేశమే. ఈ ప్రాంతంలోని right of resumption దాటిపోయిన భూములలోని కౌలుదార్లనుకూడా 'రక్షిత కౌలుదార్లు'గా గుర్తించవలసి యున్నది.

రూ. 5400 లు భూమిమీద మాత్రమే ఆదాయంగావచ్చేవారికే సీలింగుపెట్టారు. భూమి మీదనే కాకుండా యితరత్రా కూడా రూ. 5400 లు నికరాదాయం వచ్చేవారు అనేకమంది ఉన్నారు. వారికికూడా యిది వర్తింపజేయ వలసి యున్నదని మనవి జేస్తున్నాను. ఈ విషయాలను గురించి ఎంతవరకు ప్రభుత్వం చర్యతీసుకుంటుందో నాకు అనుమానంగానే యున్నది. non-agricultural classes కూడా భూమిని స్వాధీనం చేసుకొనడానికి అవకాశంలేని విధంగా ఒక ఖచ్చితమైన క్లాజు యిందులో పొందుపరచాలని నేను కోరుతున్నాను. భవిష్యత్తులో non-agricultural classes చేతులలోకి భూమిపోవడానికి వీల్లేదు. అందువలన యిందులో ఖచ్చితంగా ఒక clause వుండాలని నేను మరొకసారి కోరుతున్నాను. తరువాత personal cultivation క్రింద వున్న భూమికి సంబంధించి, స్పష్టంగా యిందులో ఒక definition వుండాలి

ఇక ఏ భూమికి సీలింగు apply చేయాలనే విషయంపై కొంతవరకు మనవి జేస్తాను. ప్రభుత్వం ఒకప్పుడు "Lands Holding Census Bill" అనే దానిని ప్రవేశపెట్టింది. తత్ఫలితంగా భూములన్నీ తారుమారు అయిపోయాయి. ఇప్పుడు కంచుకాగడాపెట్టి వెతుకుతున్నప్పటికీ భూమి కనబడడంలేదు. అందుచేత యిప్పుడు ఒక కుటుంబంలో ఉన్న తల్లి, తండ్రి, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఎవరిపేర భూమి ఉన్నప్పటికీ దాని నంతనూ ఒక కుటుంబంక్రింద ఉన్న కమతంగా పరిగణించి దానికే ceiling apply చేయవలసియున్నది. దీనికి సంబంధించి కేంద్రప్రభుత్వం వారు నియమించిన ఒక కమిటీ తన రిపోర్టులో "We are of the view that family is the real operative unit in land ownership............ We, therefore, recommend that in fixing a ceiling, the

aggregate area held by ll members of the family shoul be taken into account." అని చెప్పింది. అందువలన ఒక కుటుంబంలో వున్న వారందరిపేరా విడివిడిగా చీలిపోయిన భూమికి ceiling apply చేయడం వలన సీలింగుయొక్క ప్రధాన లక్ష్యమే భంగం అవుతుందని మనవిజేస్తున్నాను. ఇందులో బినామీ కానివ్వండి, అమ్మకాలుకానివ్వండి, అనేకం ఉన్నాయి. ముందుగానే ప్రభుత్వం యీ విషయంలో చర్య తీసుకొని ఉండవలసినది. Pl nning Commission report మేమందరం చదువుకొనడానికేకాదు, దానిని మంత్రులు కూడా చదువుకొనవలెనని కోరుతున్నాను. ఆ రిపోర్టులో ఒక విషయం స్పష్టంగాచెప్పారు. "Any transfer of lands made after a given date shoul be disregarded in computing surplus lands . .....The date should be fixed by each Government in the light of circumstances". అని వ్రాశారు. ఏదో ఒక తేదీ నిర్ణయించమన్నారు గనుక ఎప్పుడో నిర్ణయిస్తామనడం న్యాయంకాదు.

శ్రీ కె. వెంకట్రావు:— "The St te Government should fix a date" అన్నారు. అంతేనా ?

శ్రీ బి. శ్రీరామమూర్తి:— అవును. దానిని నేను కాదనటం లేదు. అయితే ఎప్పుడో తేదీ నిర్ణయిస్తున్నాం అనేదానికి బ్రతికి ఉన్నంతకాలమూ ఎదురు చూసే అవకాశముంది. ఆ "రేపు"అనేది గోడమీద రేపువలె గాకుండా యీపాటికే తేదీ నిర్ణయించి యుండవలసినదని మనవిజేస్తున్నాను. భూమి అంతా భూ ఖామందుల చేతులలోకి వెళ్ళిపోయిన తరువాత d te fix చేయడం వలన ప్రయోజనముండదు. వారు ఆ రిపోర్టులో యింకా యీ విధంగా కూడా వ్రాశారు. "The State Government shall arrange for the cultivation of lands which have been allowed to remain uncultivated without reasonable cause for the last two or three years" అని సూచించి ఉన్నారు. ఈ భూ పరిమితిలోకి రాకుండావుంటే యింతవరకూ సాగుకాకుండా వున్న భూములేమైనా ఉన్నట్లయితే వాటిని మరుక్షణం ప్రభుత్వం స్వాధీనం చేసుకొనడం గాని, లేక అవి సాగు అయ్యేట్లుగా గాని చేయవలసి యున్నది.

తరువాత యిందులో grazing land కు exemption యిచ్చారు. మొత్తం extent లో 1/3 వంతు exemption యిచ్చాము అన్నారు. 5400 రూపాయలు ఆదాయంవచ్చే భూమి ఒకప్పుడు 20 ఎకరాలే అవుతుంది, మరొక సందర్భంలో 30, 40 ఎకరాల వరకు అవుతుంది. అందులో మూడోవంతు అంటే ఒకచోట

3 ఎకరాలు. మరొకచోట 4,5 ఎకరాలు అవుతుంది. అందువల్ల grazing land క్రింద సమానమైన భూమిని కేటాయించినట్లు ఇందులో కనబడదు. అదేవిధంగా sugarcane cultivation గురించి కూడా ఇందులో ఉంది

Planning Commission వారు ఈ విషయాన్ని గురించి కూడా స్పష్టంగా వ్రాశారు 'The unanimous view was that sugarcane farms did not qualify for' exemption. అని వారు చెప్పారు. అందువలన రాష్ట్రప్రభుత్వాధీనంలో వున్న sugar factories కు సంబంధించిన భూములు మాత్రం యిది తప్పకుండా వర్తిస్తుందని స్పష్టంగా యిందులో చేరిస్తే బాగుంటుందని నేను అభిప్రాయపడుతున్నాను. ఇక — మాటకి 50 సెంటు net-income అన్నారు అంటే మొత్తం ఆదాయంలో సగం సెంతు అన్నమాట.

భూస్వామిందు దగ్గర కౌలుదారుగా వున్న రైతు—పండిన పంటలో సగ భాగం ఖర్చులే అవుతున్నప్పుడు, యింకా 50 సెంతులు 'Tenancy Protection Act క్రింద ఏవిధంగా చెల్లించగలడు' అని అడుగుతున్నాను.

ఈరోజున భూస్వామందుకు నూటికి 50 సెంతులు ఖర్చుపోవాలంటున్నారు. రైతు, కౌలుదారు మాత్రం భూస్వామందుకు చెల్లించవలసిన శిస్తు చెల్లించాలని చెబుతారు. ఈ రకమైనపక్షపాతం ప్రభుత్వం చేస్తున్న యీ ప్రాసంగంలో కష్టంతపాదిస్తుందని, కళంకం కలిగిస్తుందని మనవిచేస్తున్నాను. ఇక 5400 రూపాయల సీలింగు అన్నది ఒక ఆర్బిట్రరి ఫిగరు మాత్రం కాదు. The ceiling is with reference to something—that is a basic holding, that is a plough unit. 3600 రూపాయలు నికరాదాయం అని యిదివరకు నిర్ణయం చేసి ఉంచిరి. కాని యిప్పుడు ధరలు పెరిగినందున 5400 రూపాయలకు పెంచామని చెప్పుతున్నారు. అనగా basic holding కు 4 1/2 రెట్లు పెంచారన్నమాట. Basic holding ను అంగీకరించిన తరువాత దానికి 4 1/2 రెట్లు maximum నిర్ణయంచేసిన కుటుంబంలో 6,7,8, మంది మనుష్యులున్న సమస్య ఉదయించదా? This is maximum holding, not the minimum holding. Therefore, there is no question of 5th member or the 6th member and that clause only intended to circumvent the fundamental principle of land legislation. తరువాత భూపంపకం ఏవిధంగా జరగాలి? దానిని నిర్ణయించుటకు ప్రత్యేకించి ఒక Land Commission ను వేయాలని కోరుతున్నాను.

కళా వెంకట్రావుగారు కోరిన [illegible] కికో శేక [illegible] శ్రీరామమూర్తికి [illegible] ఎక్కికో యిచ్చేవీలులేదు. Land Commission అండని properties మీద tax వేసి ఎవరికి యివ్వాలో నిర్ణయించాలి. ఆ రీతిగా యిందులో definite గా ఒక క్లాజు ఉండాలి తరువాత maximum నిర్ణయించేయడం మాత్రమే [illegible]. Co-operative farming [illegible] పేర్కొనలేదు. అందువేత (1) యిది సమగ్రమైన శాసనం కాదు (2) [illegible] భూస్వాములకు మాత్రమే లాభం కలిగించు శాసనం [illegible]. (3) [illegible] 50 వంతులు ఖర్చుల క్రింద [illegible] యిచ్చేదంట్ల. [illegible] ప్రభుత్వానికి ఉన్న సవతి తల్లి ప్రేమను వెల్లడించు శాసనం మాత్రమే [illegible] మనవిచేయుచున్నాను.

శ్రీ కె. వెంకట్రావు:—భూస్వాములు స్వంతంగా వ్యవసాయం చేయుచున్న ఖర్చులు గాలిలో ఎగిరిపోతాయా? ఖర్చులు అనేది ఎవరు [illegible].

శ్రీ బి. శ్రీరామమూర్తి:—నూటికి 50 వంతులు ఖర్చులక్రింద పోయిన కౌలువారు శ్రమపడి చేసినందుకు యికమిగిలేది ఏమి ఉంటుంది? గడ్డిమాత్రం మిగులుతుంది.

శ్రీ కె. వెంకటరావు:—Tenant కు భూమిపై హక్కు ఇచ్చినప్పుడు కదా యీ సీలింగు వర్తించేది. ఇన్ని ఎకరాలు తెనెంటు తీసుకోవాలనే రూలు ఎక్కడా లేదు. కనుక వారు చెప్పినది operate కాదు.

కె. సుబ్బారావు (హిందుపూరు-జనరల్):— అధ్యక్షా. ప్రభుత్వాలు కొన్ని పనులను నెరవేర్చుటకు పరమేశ్వరుడు నియోగిస్తాడట. అలాగే శ్రీ కళా వెంకట్రావుగారు ఈ భూస్వామ్య సంస్కారాలకే నియమింపబడినట్లు ఉన్నది. [illegible] పరరాజులను చేసివేశారు. ఇనాందార్లను [illegible]. ఇప్పుడు భూస్వాములమీద పడ్డారు. [illegible] సాంప్రదాయం ప్రకారం సంక్రాంతి పురుషుడు సంవత్సరానికి ఒకసారి ఒక్కొక్క వాహనంమీద వస్తాడట. ఈ సంవత్సరం ఆ మహాపురుషుడు భూస్వామ్యంమీద వచ్చాడు. కాని భూస్వామ్యంపై తెచ్చిన ఈ బిల్లు ఎవరికీ సంతోషాన్ని కలిగించుటలేదు. ఎవరికీ దుఃఖాన్నికూడ కలిగించుట లేదు. సంతోష, దుఃఖాలకు అతీతమైన ఈ బిల్లులోని కొన్ని అంశాలపై చర్చ జరుగుచున్నది. మొట్టమొదట భూస్వామి ఎవరో తెలుసుకోవాలి. దున్నేవానిదే భూమి అని శ్రీరామమూర్తిగారు చెప్పారు. కర్నూలులో ఉన్నప్పుడు నే నొకసారి చెప్పినట్లు, 'గొరిగేవానిదే తలకాయ, ఉతికేవానిదే బట్ట' అనే నినాదం ప్రపంచంలో

ఎక్కడైనా ఉంటుందా? కాబట్టి ఏ శాస్త్రంలోను దున్నేవానిదే భూమి అని చెప్పలేదు. భూమి నాది అని ఎవరైనా అన్నచో భూదేవి నవ్వుతుందట. నాది అని చెప్పుటకు ఎవరికి అధికారముంది? 'చనినారు ఆరుగురు చక్రవర్తులు మహీ చక్రంబు పాలించి'. వారు నాది అని చెప్పి ఏమి వెంటగట్టుక పోయారు? కాన ఎవరు ప్రోదిచేసి, పోషిస్తాడో ఆ భూదేవి వారికి పండించి పెడుతుంది. కాబట్టి దుక్కిచేసినంత మాత్రాన భూమి దున్నేది కాదు. ఈ రోజు గ్రామాలలో వ్యవసాయదారులకంటె వ్యవసాయకూలీలే ఒకటి, రెండింతలు కూలి తీసుకొని సుఖపడుతున్నారు. భూమిని అంటిపెట్టుకొని ఉన్న నేరానికి నేడీ కష్టాలపాలు కావలసివచ్చిందికదా యని రైతులు దుఃఖపడుతున్నారు. ఈ భూ సంస్కరణలవల్ల ఉత్పత్తి ఎక్కువ ఔతుందని చెబుతున్నారు. అది గుండుసున్నామాత్రమే ఔతుందని నేను చెప్పగలను. అందరికి భూములు పంచితే వారు దానిని ప్రోదిచేసి, పోషణచేసి పండించటంకల్ల. అది ప్రపంచ చరిత్రలో ఎక్కడా జరుగలేదు. అప్పారావుగారు, గున్నయ్యగారు చెప్పినట్లు భూమిని కొనినంతమాత్రాన పండదు. ఎంతో కష్టపడి ప్రోవి చేయాలి. పిండి, పిట్టు, అమ్మోనియా సల్ఫేట్‌లాంటి ఎరువులను కొని వేసినగాని సరియైన పంటపండదు. 5400 రూపాయల ఆదాయానికి మించకూడదని అంటున్నారు. ఒక్కొక్క కుటుంబానికి సంవత్సరానికి 5400 రూపాయలచొప్పున ఇచ్చిన భూస్వాములంతా తమ భూములను ప్రభుత్వపశం చేయుటకు సిద్ధంగా ఉన్నారు. ఏ అధికారికీ నెలకు 1200 రూపాయలకు మించి జీతం ఇవ్వకూడదని కమ్యూనిస్టులు అంటారు. కాని వారి సిద్ధాంతంప్రకారం భూమి అంతా ప్రభుత్వం తీసుకోవాలని ఎందుకు చెప్పడంలేదో నాకు అర్థం కావడం లేదు.

ఈ సంస్కరణలవల్ల లభించు భూమిని వ్యవసాయకూలీలకు ఇచ్చినట్లయితే అది పండక ఎండిపోతుంది. భూమి నాశనమైపోతుంది.కాని ప్రభుత్వం ఉదారంగా పంచిపెడుతుందని ఎవరూ ఆశపెట్టుకొనిలేరు. ఆ భూములలో Co-operative farmingsను పెడతామన్నారు. పూర్వము గొంచిపద్ధతి అమలులో ఉండేది. దానిని గురించికూడ ఆలోచించాలి. అంతేకాని భూములను ఉదారంగా అందరికి పంచినంత మాత్రాన ఉత్పత్తి అధికమౌతుంది అని అనుకోవడం వట్టి భ్రమే ఔతుంది.

పూర్వం మాతండ్రిగారు ఒక్కశేరు మంచి నెయ్యికి రెండెకరాల భూమి యిచ్చారు. పంటభూమి ఉంటే కదా? పంటకు వీలైనభూమి ఎక్కడైనా ఉంటే, అది ఎవరి స్వాధీనమో అయిపోయింది. ఈనాడు పెడుతున్న ceiling ప్రకారం 5,400 రూపాయాల ఆదాయానికి పైబడ్డ భూమి ఎవరివద్దనైనా ఉంటే, దానిని "కలెక్టివ్ ఫార్మింగ్" చేసేవారికి యిస్తామని చెప్పాలి. లేని ఆశలుపెట్టి, భూమి అందరికి పంచుతామనే ఆశను దేశంలో కల్పించవద్దని చెబుతున్నాను.

ఈనాడు కమ్యూనిస్టులు చెబుతున్న (కమ్యూన్) అనబడే (గొంచి) పద్ధతి మా పల్లెలలో అనాదిగా ఉంది. దీనిప్రకారం ప్రభుత్వభూములలో పంట పండించే వారికి సగభాగము; ప్రభుత్వానికి 4వ వంతు మిగిలిన 4వ వంతు గ్రామంలోని కుంటి, గ్రుడ్డి మొదలైనఅనాధులకు-పంచుతారు. ఈనాడు దేశంలో జరుగుతున్నది ఏమిటంటే-ఒక నల్లరాతిని తీసుకువచ్చి, విగ్రహం చేసి దానికి సీతమ్మవారని, ఇంద్రుడని, చంద్రుడని ప్రాణ ప్రతిష్ఠ చేసి, పూజచేసిన పాపానికి బలికోరుతున్నది. ప్రతి ఒక్కరు కూడా బలి కోరుతున్నారు. అమాయక ప్రజలలో భూమి యిస్తామని ఆశ కల్పించి; తినడానికి తిండి, కట్టుకోడానికి గుడ్డ మొదలైనవన్నీ మేమిస్తామని చెప్పి యీ కోరికలన్నీ దేశంలో పెట్టినదానివల్లే యీ దుఃఖమంతా ప్రాప్తమౌతోంది కాబట్టి యిప్పుడు వచ్చే భూమిని ప్రభుత్వం "గొంచి" పద్ధతిని యివ్వాలే కాని, కూలీలకు నాలీలకు యిస్తామనే భావన మనస్సులలో create చేయకుండా చక్కగా పనిచేయాలి.

భూమిమీద ఎంత ఆదాయం వస్తుందో నాకు బాగా తెలుసు. నేను చెరుకు వేస్తున్నాను. 540 రూపాయలు ఖర్చుచేస్తే ఒక వెయ్యి రూపాయలు వస్తాయి. Sugar f ctory ఉన్న చోట యీ చెరుకుతోట లాభమేమో కాని, తక్కిన చోట్ల లాభసాటి కాదు. రాత్రులందు పనిచేయడానికి నాకు కూలీలు కావాలయ్యా అంటే, నెలజీతం యిచ్చి, తిండి పెట్టమంటారు. ఆ కూలీలు తమ యిళ్ళవద్ద అర్ధపావు బియ్యం తినే తిండి; నాయింటికి వచ్చి శేరు బియ్యం తింటారు. ఇటువంటివి అనేకం ఉంటాయి కాబట్టి, ఒకరికి వచ్చే నికరాదాయం చెప్పడం కష్టం. రాయలసీమ జిల్లాలలో 5 సంవత్సరాలలో 2 సంవత్సరాలు కరువు తప్పదు. ఈ కరువు నివారణకై ప్రభుత్వంవారు ఆనకట్టలు కట్టించారు. ఏమి చేసిన ప్పటికి వర్షాలు కురువాలి కదా! Ceiling నిర్ణయంలో 10 సంవత్సరాల పంటను తీసుకొని aver ge కడతామని చెబుతున్నారు. రాయలసీమలో ప్రతి 5 సంవత్స రాలలోను రెండు సంవత్సరాలు కరువు ఉంటుంది. గనుక, 10 సంవత్సరాలలో ver ge అంటే 20 సంవత్సరాలు లెక్కలోకి తీసుకోవాలి. కాని Pl nning Commission వారు 20 సంవత్సరాలకు అంగీకరించలేదు. వారు చెప్పినట్లు 10 సంవత్సరాలే తీసుకున్నా, ఉదాహరణకు చెరుకువేస్తే, అది 5సంవత్సరాలకు ఒకసారి మాత్రమే. పంట అభివృద్ధికావడానికి వేసినదానినే మరలవేస్తే పంటపండదు. కాబట్టి పంటను ఎప్పటికప్పుడు మారుస్తూఉంటే పంట పెరుగుతుంది. కనుక ఒక సంవత్సరం వరి, మరొక సంవత్సరం చెరుకు, వేరే సంవత్సరం రాగి పంట వేస్తే, సరాసరి వచ్చేసరికి అంతాకలిపి 1000—1500 రూపాయలకు మించివచ్చే పరిస్థితి లేదు. కనుక కష్టపడి పంట పండిస్తేకాని లాభంలేదని తేలుతోంది. ఈదేశంలో పంట అభివృద్ధి కావాలంటే యిప్పుడున్న వారికే ప్రోదిచేయండి. పండించడానికి ప్రయత్నం చేయండి. కష్టపడకుండా తెల్లవారేసరికి పంట పండదు. ప్లానింగ్ కమీషన్

లెక్కల ప్రకారం యింకో పది సంవత్సరాలకు గాని పంటల అభివృద్ధిచెందే పరిస్థితి ఏమీలేదు కాబట్టి యిప్పుడున్న భూస్వాములకు 1కి 3 రెట్లు పంటను పండించే పరిస్థితికి దోహదంచేస్తే పంట అభివృద్ధి చెందుతుందేకాని, బిల్లులు పెట్టి వ్యవహారం చేస్తే చట్టాలను గౌరవమిచ్చే దేశంకాదిది ఒక చట్టాన్ని చేసేసరికి, దానిని వ్యతిరేకించే ప్రజలు సిద్ధంగా ఉంటారు. చట్టం తయారు కాకమునుపే అది బయట అమలు జరిగిపోతుంది మా జిల్లాలలో 5,100 రూపాయలు ఆదాయం వచ్చే వారే కనిపించరు. ఏ కొద్దిభూమివచ్చినా, ప్రభుత్వంవారు చేసి చెప్పినట్లుగా నిక్కచ్చిగా "గొంచి" పద్ధతిపైన సర్వ జనులకు ఉపయోగపడేటట్లుగా చేయాలేకాని. కూలి, నాలుగు యిస్తామని చెప్పి ఆశ చూపరాదు. ఆశపెట్టి, నిరాశచేసి, దుఃఖప్రాప్తి కలిగించామని ఆ దుఃఖంతో మళ్ళీ అనేకమైన వ్యవహారాలు చేసేది లేదు కాబట్టి యీ బిల్లును Select Committee లో చక్కగా పరిశీలించి, వ్యవహారం చేయవలసిందిగా కోరుతున్నాను. ఆ Select Committee లోని వారంతా Absentee land lords అనే విమర్శ వస్తుంది వారు చేసిన పాపమేమిటని అడుగుతున్నాను. ఇన్ని రోజులు దేశాన్ని సంరక్షించిందా వారు చేసిన పాపం ఎవరు ఎన్నిచేసినా Absentee Land Lord లేనిదే పని జరుగనే జరుగదు వీరు భూమికి కావలసిన దోహదంచేసి. రైతుకు అండగా ఉంటారు ఇలా కాకుండా రైతు తానే సర్వస్వం చేసుకొని కాని, లేక వానికి ప్రభుత్వమే కావలసినంతా యిచ్చి పనిచేస్తుంది అనేది యీ ప్రపంచంలో ఎక్కడా జరిగేదిలేదు గనుక Absentee land lords అవసరం లేకపోలేదు. పది ఎకరాలకు 5 400 రూపాయలు వచ్చినా, 1000రూపాయలు వచ్చినా మాకు సమ్మతే ఒకనికి 3—1 ఎకరాలుంటే, గ్రామాధిపశాస్త్రి నౌకరీ చేసుకొంటూ స్వగ్రామం విడిచి, వేరే గ్రామంలో ఉంటే, అతనికి వచ్చే ఎటుంబడిని లెక్కపెట్టుకొంటే దానికి నా అభ్యంతరం లేదు. వడలబడి; గుమస్తా పనిచేసేవానికి 3 ఎకరాల భూమి కృష్ణా తీరంలో ఉంటే, అతనికి ఎకరాకు 10 చొప్పున 30 బస్తాలు యిస్తారు. రైతు ఎకరానికి 15 బస్తాలు తీసుకొని పోతున్నాడు." ఈ 10 బస్తాలైనా Absentee land lord కు యివ్వడం అవసరం అనుకోకుండా సమన్వయం చేసే పద్ధతిని చట్టంలో చక్కగా చేసి, దేశంలో అవాంతర పరిస్థితులు కలిగించకుండా, అనేకమైన అల్లకల్లోలాలు పెట్టకుండా, సర్వజనులకు ఉపయోగపడేట్లుగా మంత్రిగారు చేయాలని ప్రార్థిస్తూ, నేను యింతటితో విరమిస్తున్నాను

శ్రీ కె. పున్నయ్య (చీపురుపల్లి-రిజర్వుడు):—అధ్యక్షా, ఈ రోజున చాలా ప్రధానమైన సమస్యపై చర్చిస్తున్నప్పుడు విభిన్నాభిప్రాయాలు వెలువడటం సహజంగానే ఉంది. గత 10,15 సంవత్సరాలనుంచి కూడా ఈ భూసంస్కరణల

కాని యిప్పుడు ఉన్న ఆదాయాన్నిబట్టి సీలింగు పెట్టకూడదు అని ఈ బిల్లులో స్పష్టంగా చెప్పబడింది. ఆ విధంగా చేయటంవలన ప్రభుత్వం డిస్క్రిమినేషన్ చూపుతున్నట్లు కనబడుతున్నది ఈ సందర్భంలో R D O లకు ఎక్కువ అధికారాలు యివ్వటం జరిగింది రెవిన్యూ వ్యవహారానికి సంబంధించినంతవరకు R. D. O. లు, తహశీల్దారులు, సెటిల్‌మెంటు ఆఫీసర్లు, ఉన్నప్పటికీ, R. D O. లకే ఎక్కువ అధికారాలు యివ్వటం జరిగింది. వీరికి అధికారాలు యివ్వటంవలన F.S O, T S.O ల రోజులలో జరిగిన భయంకర సంఘటనలే యిప్పుడు కూడా జరగటానికి అవకాశం ఉంటుందేమో అన్న అభిప్రాయాన్ని, అనుమానాన్ని, భయాన్ని చాలామంది గౌరవ సభ్యులు వెలిబుచ్చారు. వారిని assist చెయ్యటానికి నాన్ అఫిషియల్ మెంబర్లను నియమిస్తే మంచిదని నేను మనవి చేస్తున్నాను. ఏదో విధముగా ఈ రోజున ఈ భూసంస్కరణల బిల్లును తమ చాతుర్యమును, శక్తిసామర్థ్యములను వినియోగించి కళా వెంకట్రావుగారు ప్రవేశ పెట్టటం చాలా సంతోషకరమైన విషయం. ఈ భూసంస్కరణల వలన ఎంత భూమి లభిస్తుందో తమకు తెలియదని వారు తమ మెమొరాండంలో తెలిపారు. అయినా యీ బిల్లును నేను హర్షానందాలతో బలపరుస్తున్నాను.

శ్రీ యస్. వి. కె. ప్రసాద్:— అధ్యక్షా, గౌరవనీయులైన శ్రీ కళా వెంకట్రావుగారు తమ ప్రసంగాలలో వెనుకటి హైదరాబాదు టెనన్సీ యాక్టును, ప్లానింగు కమీషన్‌వారి సూచనలను దృష్టిలో పెట్టుకునే భూ సంస్కరణల బిల్లును ప్రవేశపెట్టడం జరుగుతుందని చెప్పారు ఈ రెండు ఆదర్శాలకు భంగం కలిగించే విధంగా దేశంలో ఉన్నవారు ప్రవర్తిస్తూ ఉంటే దానికి అవసరమైన ప్రతిక్రియను మనం ఆలోచించవలసి ఉంటుందని వారు చెప్పారు. కాని ఇప్పుడు ప్రవేశపెట్టిన బిల్లును చూచినట్లయితే ఆ రెండు అభిప్రాయాలకు విరుద్ధంగా ఉందని చెప్పకతప్పదు. ప్లానింగు కమీషన్ వారు తమ రిపోర్టులో యిచ్చిన నిర్వచనమునకు విరుద్ధముగా మన ప్రభుత్వము ఈ బిల్లులో నిర్వచించి అదే సరియైనదని చెబితే అంగీకరించడం సాధ్యంకాదు. ప్లానింగు కమీషన్‌వారు సీలింగు అంటే నిర్వచనంచేస్తూ స్పష్టంగా చెప్పారు. ద్వితీయ ప్రణాళికను గురించి వ్రాసిన పెద్ద గ్రంథంలోనికి నేను వెళ్ళడం కష్టం. ప్లానింగు మంత్రి నందాగారు A. I C. C కి యిచ్చిన రివ్యూ అనుకుంటాను. "Economic Bulletin-September, 15, 1957" అనేదానిలో Abolition of intermediaries; Regulating the land holdertenant; system Redistribution of land by placing ceiling upon future acquisition and existing holdings and acquiring surplus area above the ceilings for re-settlement

of landless agricultural workers and increasing the size of uneconomic holdings" అని చెప్పారు. కాని ప్రభుత్వ బిల్లును చూసినట్లయితే undue concentration of wealth ను తగ్గించడానికి చేస్తున్న ప్రయత్నంగా కన్పిస్తున్నది. అంతే ప్రణాళికలో సీలింగు విషయమై ఉన్న పునాది redistribution of land పోయినదన్నమాట. Undue concentration of wealth ను తగ్గించాలన్నది మాత్రమే సమస్యకాదు. భూమిలేని వ్యవసాయకూలీలకు, పేద రైతులకు భూమి పంచడం అనేది ప్రధాన ఆశయంగా అందులో చెప్పిఉన్నారు. మరొకచోట యీ విధంగా స్పష్టీకరించారు: The ceiling on land is intended not mainly to reduce the disparities of agricultural incomes but also to provide some land for distribution to the landless agricultural workers. ఇంకా చదవాలంటే వ్యవధి చాలదు. ద్వితీయ ప్రణాళికలో ఉన్న ముఖ్యమైన యీ అంశాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఈ విషయాన్ని, తెలంగాణాలో అమలులోఉన్న చట్టాన్ని, రెంటింటిని దృష్టిలో పెట్టుకుని, స్థానిక పరిస్థితులను కూడా దృష్టిలో పెట్టుకుని చేయవలసి యున్నది. ప్రతిపక్ష సభ్యులు, ప్రభుత్వపక్ష సభ్యులు చెప్పిన దానిని బట్టి యిది అమలు జరుగలేదని తెలుస్తున్నది. ఈ బిల్లును ప్లానింగు కమీషన్ వారు అంగీకరించారని మంత్రిగారు చెప్పారు. అది సరియైనది కాదని ప్లానింగు కమీషన్ కూడా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించిన సీలింగును అంగీకరించడంలేదని యిప్పుడు తెలుస్తున్నది. కాంగ్రెసు పత్రిక అయిన హిందూస్థాన్ టైమ్సులో నిన్న ఒకవార్త వచ్చినది.

"The Planning Commission has disapproved of the Andhra Pradesh Government's proposal for fixing the ceiling on existing landholdings at a net annual income of Rs. 5,400, which it regards as too generous, keeping in view the small size of an average holding in the country.

The proposed ceiling marks a big jump on the ceiling of Rs. 3,600 already in force in the Hyderabad area of the State . . . . . .

The Planning Commission's views have been communicated to the Andhra Pradesh Govt. but as these views cannot be mandatory attempts are to be made at the political plane to tackle the issue."

శ్రీ కె. వెంకటరావు:— ప్లానింగ్ కమీషన్‌వారి సంతకంతో నా దగ్గర కాగితం ఉన్నది. వారి ఆమోదంపొందిన విషయం అందులో ఉన్నది. సభ్యులు ఎవరో పత్రికాధిపతులు వ్రాసిన దానిని బట్టి చెబుతున్నారు.

శ్రీ యస్. వి. కె. ప్రసాద్:— కాబట్టును: తిరిగి సాకల్యంగా విచారించి మరొక అభిప్రాయానికి వస్తారేమో, లోపల ఏమి జరుగుతున్నదో నాకు తెలియదు. హిందూస్తాన్ టైమ్సు ప్రతిపక్ష పత్రిక కాదు. ఫలంగారు హ్లాటు తాసి ఉన్నది. ఇతర విధాలుగా ఏమైనా జరుగుతుందేమో తెలియదు. ప్లానింగు కమీషన్ వారి ఉద్దేశప్రకారం యీ సీలింగులేదని స్పష్టంగా తెలుస్తూనే ఉంది

మిస్టర్ స్పీకర్:— మీరు చెప్పినదానికి మంత్రిగారు తరువాత జవాబు చెబుతారు.

శ్రీ యస్. వి. కె. ప్రసాద్:— తెలంగాణాలో అమలులో ఉన్న చట్టాన్ని దృష్టిలో పెట్టుకుని చేస్తామని మంత్రిగారు చెప్పారు. తెలంగాణాలో 3600 రూపాయలు నికరాదాయం వచ్చే భూమి సీలింగుగా చేయబడది. ప్లానింగు కమీషన్ వారు నిర్ణయించిన family holding ను కొలబద్దగా తీసుకుని గిట్టుబాటు వ్యవసాయక్షేత్రం work out చేయబడింది. మొదటి ప్రణాళిక అమలులో ఉన్నప్పుడు దీనిని చేశారు. ద్వితీయ ప్రణాళిక అమలులోనికి వచ్చిన తరువాత 3600 రూపాయల నుంచి 4800 రూపాయలు వరకు నికరాదాయం తీసుకోవాలని draft outline లో స్పష్టం చేయబడింది. దీనిని యిప్పుడు మార్చివేయడం జరుగుతున్నది. అందులో ఉందే కొలబద్ద అయిన family holding ను ఎత్తివేసి 3600 రూపాయల నుంచి 7200 రూపాయల వరకు పెంచుతున్నారు. కుటుంబం అంటే యిచ్చిన నిర్వచనం గురించి కూడా మంత్రిగారు చెప్పారు. హైదరాబాదు చట్టంలో ఒక కుటుంబం మొత్తం అని చెప్పబడింది. సమిష్టికుటుంబంలో ఎంతమంది వాటాదారులు ఉంటే అంతమందికి 5400 రూపాయలు నికరాదాయం వచ్చే భూమి, యింకా వచ్చినట్లే యివ్వవచ్చునని మంత్రిగారు స్పష్టంచేశారు. తెలంగాణాలో అమలులో ఉన్నచట్టమే సరిగా అమలు జరుగలేదని, అనేక బినామీ transfers జరిగాయని సభవారికి తెలుసును. దీనినికూడా పెంచవలసిన అవసరం ఏమి వచ్చింది? ధరలు పెరిగాయి అన్నారేకాని అప్పటికి యిప్పటికి అంతగా ధరలు పెరిగినట్లు కనిపించడం లేదు. తెలంగాణాలో పెంచమని అడిగే ధైర్యంకూడా ఏ భూస్వాములకు కనిపించడంలేదు. స్వామి రామానంద తీర్థ వంటివారు యిది తప్పు, తెలంగాణాలో ఉన్నది ఉన్నట్లు యథావిధిగా ఉంచాలనిచెప్పారు. ప్రతిజిల్లాలోని Revenue Circles కుటుంబక్షేత్రం యింత అని నిర్ణయించి అమలుజరగడానికి సిద్ధంగాఉన్న సమయంలో పద్ధతి సంతను మొత్తం revers చేయడం అంటే ఒక సెంటుకూడా పంచడానికి మిగులదు. అన్నమాట. స్థానిక పరిస్థితులను బట్టి మార్చుకోవచ్చును అన్నారంటే ఆంధ్ర ప్రాంతంలో ఏదైనా దాగా ఉన్న విషయాన్ని తీసుకు రావచ్చును; తెలంగాణా

చట్టంలో ఉన్న బలహీనతలను తొలగించవచ్చును. ప్లానింగు కమిషన్ వారు కాని నందా గారు కాని బలహీనతలు తొలగించాలన్నారే కాని సీలింగును పెంచాలని చెప్ప లేదు. నేను చదివిన దానిలో హైదరాబాదు చట్టంలో loopholes ఉండటంవలన బినామీ transfers ను అరికట్టలేక పోయినవని అందుచేత చట్టంలో సవరణలు తీసుకురావాలని చెప్పారు. ఎవరూ చెప్పనిదే, ప్లానింగు కమిషన్‌వారి ఉద్దేశంలో లేనిది, ఎందుకు పెట్టవలసి వచ్చింది ?

మిస్టర్ స్పీకర్:— ప్లానింగు కమిషన్‌వారు ఒప్పుకున్నారా ?

శ్రీ కె. వెంకటరావు:— ఒప్పుకుని 'writing' లో నాకు వ్రాశారు.

మిస్టర్ స్పీకర్:— ప్లానింగ్ కమిషన్ వారు ఒప్పుకోలేదని పదే పదే అనవద్దు, మిగతావి ఏమైనా చెప్పండి.

శ్రీ యస్. వి. కె. ప్రసాద్:— ఏ రూపంలో ఒప్పుకున్నారో House ముందు పెడితేనే కాని చెప్పలేము. కొన్ని limitations తో అనుమతి యిచ్చి ఉండవచ్చును. Modify చేయాలని చెప్పి ఉండవచ్చును. తెలంగాణాలో భూమిలేదు అంటున్నారు. 1955 వ సంవత్సరంలో substantial holders అంటే 400 కుటుంబక్షేత్రాలకు పైబడి ఉన్నవారు declarations యిచ్చారు మా దగ్గర యింతింత భూమి ఉన్నదని, దానిప్రకారం, ప్రకటించిన లెక్కలనుబట్టి 6,53 వేల ఎకరాలున్నట్లు తెలుసుకోవచ్చును.

ఈ అంకెలుప్రభుత్వం తయారుచేసిన లెక్కలను ఆధారంగా చేసుకునే తెలియ జేశాను. ఎన్నోబినామీ అమ్మకాలు యీ మధ్య జరిగాయి. 1952 తరువాత జరిగిన అక్రమ విక్రయాలను లెక్కలోకి తీసుకోనప్పటికీకూడా సబ్‌స్టాన్షియల్‌హోల్డర్స్ ఇచ్చిన లెక్కలనుబట్టియైనా 6,53,000 ఎకరాలు పంపకానికి అవకాశమున్నట్లు తేలింది. కాని ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతర్వాత కూడా ఆ చట్టాన్ని సరిగా అమలు చేయనందువల్ల యీ మిగులు భూమికూడా అన్యాక్రాంతమైపోయింది. మా మునుగోడు తాలూకాలో పంపకానికి భూమి లేనట్లే ఉన్నది. ప్రభుత్వం అనుసరిస్తున్న భూసంస్కరణల విధానం ప్లానింగ్ కమిటీవారు చెబుతున్నదానికి విరుద్ధంగా ఉన్నది నందాగారు చెప్పినదానికి విరుద్ధముగా ఉంది భూములను భూ స్వాములకు దక్కించే నిమిత్తమై యీ సంస్కరణలు ఉద్దేశింపబడినవా అని అనుకోవలసివస్తున్నది. ఈ పరిస్థితులను మరుగుపరచడానికేమో ఈ మధ్య ప్రభుత్వంవారు ఆంధ్రప్రదేశ్‌లో పంపకానికి 32 లక్షల ఎకరాల భూమి ఉన్నదని ఒక కథ కల్పించారు. ఇది వాస్తవం కాదని

శ్రీ పి. సుందరయ్యగారు ఇదివరకే తెలియచెప్పారు ఏవో లెక్కలను చూపి భూ సంస్కరణలు అమలు పరుస్తామని చెప్పేదానికన్నా పేద రైతాంగానికి వ్యవసాయ కూలీలకు లాభించేరకంగా వారి జీవనప్రమాణాన్ని కొలిచే విధంగా శాసనాలు చేయ వలసినదని ప్రభుత్వాన్ని కోరుతున్నాను

శ్రీ బి. అప్పారావు (అనకాపల్లి):—అధ్యక్షా, భూ సంస్కరణల బిల్లుపై సోదర సభ్యులు చేసిన ప్రసంగాలను ఓపికతో విన్నాను. ఈ విషయంలో నాకుకొన్ని అభిప్రాయాలున్నాయి భూ సంస్కరణలతోపాటు ఇతర ఆస్థులపైకూడ పరిమి తులు ఏర్పాటు చేస్తామని ముఖ్యమంత్రిగారుకూడా చెప్పి ఉన్నారు.

శ్రీ ఎన్. సంజీవరెడ్డి:—దీని విషయంలో శ్రీ అప్పారావుగారు కొందరు ఇతర మిత్రులుకూడా తప్పు అభిప్రాయంలో ఉన్నారు. నూటికి 75 మంది ఉన్న రైతుల భూమికి సంబంధించి సంస్కరణలు తెచ్చినపుడు మిగిలినవారి ఆదాయము లపైకూడా పరిమితి పెట్టడానికి వీలవుతుందా? ఇంత హెచ్చుమంది ఆ విధంగా చేయ మని చెప్పినపుడు ఎంతకాలం నిలిపిపెట్టగలమని నేనన్నాను. నాకు అధికారం ఉంటేనే ఆ పని చేస్తాను. కాని లేనిదే చేయగలిగిన దేమిటి? మనకా అధికారం లేదు. కాన్‌స్టిట్యూషన్‌లో అట్టి ప్రోవిజన్ లేదు ఈ పరిస్థితులలో అదేదో ముఖ్య మంత్రిగారు చెప్పారు అన్నంతమాత్రంచేత ప్రయోజనంలేదు. ముఖ్యమంత్రిగారికి ప్రత్యేకాధికారాలనేవేవీ లేవు. అసెంబ్లీవారిచ్చిన అధికారాలే నా అధికారాలు.

శ్రీ బి. అప్పారావు:—ముఖ్యమంత్రిగారికి ఆ అధికారాలుండాలని నా అభి ప్రాయం అట్టి అభిప్రాయాలు వారికి కల్పించేటట్లుగా శాసనసభవారు కృషిచేయాలి.

మిస్టర్ స్పీకర్:—కాన్‌స్టిట్యూషన్‌లో ఉండే అధికారాలు మనకెలా వస్తాయి?

శ్రీ బి. అప్పారావు:—కాన్‌స్టిట్యూషన్ ఇదివరకెన్నో పర్యాయములు మార్చారు. అవసరమైతే ఇపుడుకూడా మార్చవచ్చు. వ్యవసాయదారులతోపాటు ఇతర వృత్తులవారి ఆదాయములపైకూడా ఒక పరిమితి ఉండాలని శ్రీ సుబ్బారావు పంతులుగారు చెప్పారు. అట్టి కన్‌విక్షన్ ఒకటి ఉండాలని వారన్నారు మంత్రులకు నెలకు 500 రూపాయల జీతం ఉండవలెనని కరాచీ కాంగ్రెసు తీర్మానం. ఈ 500 రూపాయల జీతం ప్రాతిపదికను మనం ఆమోదించినట్లయితే ఇతర రాష్ట్రాలవారికన్న మనము ప్రోగ్రెసివ్‌గా ఉంటాము. అంటే సాలుసరి ఆదాయం 6 వేలన్నమాట అన్నివృత్తులవారికి ఆ పరిమితిని వర్తింపచేసినట్టయితే సాంఘిక న్యాయాన్ని కలుగ

జేసినవాళ్లమవుతాము ఆవిధంగా చేయనపుడు సమాజంలోని అన్నిసర్గాలవారి పట్ల సమానత్వం సాధిస్తామని చెప్పడంలో అర్ధమేమున్నది. సిద్ధాంతరీత్యా కమ్యూనిస్టు సోదరులకు కొన్ని ప్రత్యేకాభిప్రాయాలుండవచ్చు. చైనాలోని 50 కోట్లమంది ప్రజలకు భూమి అప్పగించామని కమ్యూనిస్టుసోదరులు సగర్వంగా చెప్పుతున్నారు. కమ్యూనిస్టు పార్టీవారికి ఒక ప్రత్యేక సిద్ధాంతం, దానిని అమలు పర్చటానికి ఒక విధానం ఉన్నాయి. ఐతే ప్రజా స్వామ్యంలో రైతు స్వామ్యం ఒక భాగం అనుకున్నప్పుడు రైతుతోబాటు ఇతర వృత్తులవారి సంపాదనపైకూడా ఒక పరిమితి ఉండాలి బాపూజీని అందరం జాతిపిత అని అనుకుంటున్నాము. ఐతే బాపూజీ చెప్పిన సూత్రాలు కొన్ని ఉన్నాయి. భూమంతా గోపాలునిదే అని మంత్రిగారు అన్నారు ఐతే యీ గోపాలుడనే పదానికి నిర్వచనమేమో తెలుసుకుందామని ఒక సారి వార్ధాపోయాను. గోవులు భూములకు అవసరంగాబట్టి భూమిని సాగుచేసే రైతే గోపాలుడు అని నిర్వచించారు. అన్నభుక్కులకు, అన్న ఉత్పత్తిదారులకు వ్యత్యాసాలు ఎపుడూ ఉంటూనే ఉంటుంటాయి వాటిని సాధ్యమైనంతవరకు తగ్గించాలి. సాలుసరి గరిష్ఠ ఆదాయం 6 వేల రూపాయలు అనుకున్నప్పుడు ఆ పరిమితిని రైతులకు ఇతర వృత్తులవారికి అనువర్తిస్తే యీసమస్యను న్యాయంగా పరిష్కరించినవారమవుతాము. గాంధీజీ శిష్యులమని అనుకుంటున్నవారే ఇప్పుడు అధికారంలో ఉన్నారు. అందువల్ల గాంధీజీ మనకిచ్చిపోయిన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టి ఇతర రాష్ట్రాలవారికి ఆదర్శప్రాయంగా ఉందామని మనవిచేస్తున్నాను.

శ్రీ బి. శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం—జనరల్):-అధ్యక్షా, ఈ బిల్లులోని అంశాలనుగురించి ప్లానింగ్ కమీషన్‌వారి ఆమోదం ఉన్నదని మంత్రిగారు చెప్పారు. ఐతే ప్లానింగ్ కమీషన్‌వారు ఒక కుటుంబానికి మూడువేల ఆరువందల రూపాయలు నికరాదాయమనిగాని, 4800రూపాయలు మొత్తంఫలసాయంగాని పరిమితిగా నిర్ణయించవలెనని చెప్పారు. ఈ అభిప్రాయానికీ యీనాడు మంత్రిగారువెలువరించిన అభిప్రాయానికి ఎంతో దూర మున్నది. ప్లానింగు కమీషన్‌వారు ఇదివరలో చెప్పినదానికి అఖిల భారత కాంగ్రెసువారు ఆమోదం తెలిపారు. దానినికూడా యీ నాడు మంత్రివర్గం త్రోసిపుచ్చుచున్నది. ఈ నాడు ప్రభుత్వం నిర్ణయించిన పరిమితివల్ల పేద రైతాంగానికి, కూలీలకు పంచటానికి భూమి ఏమీ ఉండదు. 1957 వ సంవత్సరం నవంబరు మాసంలో లాండ్ సెన్‌సెస్ బిల్లుపై మాట్లాడుతూకూడా మంత్రిగారు పేదవారికి భూమి పంచుతామనిఅన్నారు. ఐతే యీనాడు వారువెలిబుచ్చిన అభిప్రాయాలకు వెనుక వారు చెప్పినదానికి ఆమడలదూరమున్నది. ఐదుగురుగల కుటుంబానికి మూడువేల ఆరువంచల రూపాయలునికారాదాయంగాని, 4,800 ఫలసాయంగాని గరిష్ఠపరిమితిగా ఉండవలెనని ప్లానింగ్ కమీషన్‌వారు, అఖిలభారత కాంగ్రెసుసంఘంవారు సూచిం

చినరియవాడకూడా వానిని కాపని ఐదుగురుగల కుటుంబానికి 72 వేల రూపాయలు ఆదాయంవచ్చే భూమి కట్టబెట్టచూడడం శోచనీయమైన విషయం. ఒక వ్యక్తి 5,400 రూపాయల నికరాదాయంకాని 4,800 ఫలసాయంగానివచ్చే ఆస్తికలిగి ఉండవచ్చె నన్నపుడు ఐదుగురుగల కుటుంబానికి 54,000 రూపాయల ఫలసాయం వచ్చే ఆస్థి వుంకు ఉండవచ్చు. ఇదేకాక దీనితో మూడవవంతు భూమిని వచ్చిక బయళ్ళుగా అదనంగా కలిగి ఉండవచ్చు అంటే ఐదుగురు గల కుటుంబానికి 72.000 ఆదాయంవచ్చే భూమికూడా ఉండవచ్చునన్న మాట. దీనివల్ల బీదప్రజలకు పంచడానికి భూమి ఎక్కడినుంటు ది. పేదవాళ్ళ కొనుగోలు శక్తి ఎలా పెరుగుతుంది. ఇంతే కాకుండా యీ బిల్లుశాసనమైన తరువాత నోటిఫికేషన్ వారి అమ్మే రకుకూడా వారికి యీ నాడున్న ఆస్తులను అమ్ముకొనవచ్చు.

మిస్టర్ స్పీకర్:—ఇపుడు గౌరవసభ్యులు చెప్పుతున్న లెక్కల నీ ఎక్కడివి?

శ్రీ కె. వెంకటరావు:—ఈ విషయంమీద కమ్యూనిస్టు సభ్యులు ఏవేవో అంకెలు చదువుతున్నారు. ఐతే ప్లానింగ్ కమీషన్‌వారు ఏమి చెప్పినదీ తెలియ చేస్తాను.

"The Planning Commission in the Draft Second Five Year Plan proposed a ceiling which would yield a net income of Rs. 3,600 per annum for an average family not exceeding five members, and a ceiling providing higher net income, subject to a maximum of Rs. 7,200 per annum for larger families. These proposals, the Commission would, however, appear to have been అది అవసరంలేదు.

"The revised Second Five Year Plan as finally presented to the Parliament does not prescribe any particular monetary limit for determining the level of the ceiling, but merely suggests that as only a small fraction of agricultural holdings could be described as large holdings, it would be convenient to place the ceiling at about three family holdings. The Commission has not, however, defined what a 'family holding' should be but have stated that such holding may be considered from two aspects: (1) as operational unit; and (2) as an area which can yield a certain average income. They have suggested that each State should specify according to the conditions of different regions, class of the soil, irrigation, etc., the area of land which may constitute a family holding."

శ్రీ బి. శంకరయ్య:—నేట్లుగా అందువల్ల మీరు చెప్పేసనే, ఐదుగురు కలిసి నలుగురుంటి ఫామిలీకి 3,600 రూపాయలు ఆదాయంగాని, 4,000 రూపాయల వలసాయంగాని ఉండటంఅన్నది మనదేశంలో న్యాయంగా ఉంటుంది అని వారు చెప్పారా లేదా అని అడుగుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు:—వారు మొట్టమొదట డ్రాఫ్ట్ సెకండ్ ఫైవ్ ఇయర్ ప్లానులో వ్రాసిన మాట నిజము. దాని ఫైనల్‌గా పార్లమెంటుకు ఇచ్చిన ప్లానులో యీ విషయాలు రేపు; తీసివేశారు ఎందుచేత ఇట్లా చేసినారంటే ... సభ్యులు దానికి రిఫర్ చేయకుండ వారు తమ అభిప్రాయం చెప్పవచ్చు అలా ఉండటం మంచిదని చెప్పవచ్చు. నోట్ చేసుకుంటాను. ... చెబుతాను.

శ్రీ బి. శంకరయ్య:—మిగతా అన్ని రాష్ట్రాలలో కన్నా, మన ఆంధ్ర దేశంలో వ్యవసాయం మీద ఆధారపడినవారు ఎక్కువమంది ఉన్నారు. గ్రామాలలో నివసించేవారు ఎక్కువమంది ఉన్నారు. అటువంటప్పుడు, ఇక్కడ ఉన్నటువంటి పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు కొనుగోలు శక్తి పెంచేదానికి, భూములు ఇచ్చేదానికి వీలుగా రిఫారమ్స్ తేకుండా ఉంటే, వీటిని మనము భూసంస్కరణలు అని అంటామా? ఇవి ప్లానింగ్‌కమిటీ సూచనలకు అనుగుణంగా ఉన్నాయని అంటామా? కాంగ్రెసు కమిటీ సూచనలకు అనుగుణంగా ఇవి ఉన్నాయని అంటామా? కేవలం భూస్వాములకు లాభం కలిగించేందుకు మాత్రమే యీ బిల్లు పనికివస్తుంది. నేను ఇప్పుడే మన గౌరవసభ్యులు కోటిరెడ్డి గారితో మాట్లాడాను. మనం నోటిఫై చేసేదాకా భూములు అమ్ముకోడానికి అవకాశం ఉన్నదిగనుక ఎవరూ ఒక సెంటు భూమికూడ అమ్ముకోకుండా మిగల్చరు. "మీకు ఉచితంగా భూమి ఇస్తాము. 4 రూపాయలు భూమిశిస్తు ఇవ్వండి. మేమే మీకు పది రూపాయలు పెట్టుబడి పెడతాము; మీరు సాగు చేసుకోండి" అని చెప్పినప్పటికీ ఎవరూ తీసుకోని టువంటి భూమిమాత్రమే మిగులుతుంది. అటువంటి భూములను ప్రభుత్వానికి ఇచ్చి, దానివల్ల డబ్బు తీసుకొని, భూస్వాములు లాభం పొందేందుకు మాత్రమే యీ బిల్లులో అవకాశము ఉన్నదితప్ప, సామాన్య రైతులకు దీనివల్ల ఎట్టి లాభము లేదు. నోటిఫై చేసేదాకా భూములు అమ్ముకోవచ్చునని అంటున్నారు. ఇదివరకు మనం ఒక డేట్ పెట్టి 20 ఎకరాల పైన ఉన్నవారు లాండ్ సెన్సస్ ప్రభుత్వానికి తెలియజేయమని చెప్పినపుడు, మన రాష్ట్రంలో ఎన్ని రిజిష్టర్స్ అయినవో, ఎన్ని పంపకాలు అమ్మకాలు జరిగినవో, ఎన్ని బినామీ ట్రాన్స్‌ఫర్స్ జరిగినవో ప్రభుత్వ దృష్టికి వచ్చే ఉంటాయి మొట్టమొదట 'బిల్లు వస్తుంది' అని పత్రికలలో సూచనలు

చేసినప్పుడు "బిల్లు ప్రకటించిన తేదీనుండి యీ అమ్మకాలు చెల్లవు" అని అన్నారు. కాని మనముందు బిల్లు వచ్చేటప్పటికి, నోటిఫైడ్ డేట్ తర్వాత అమ్మకాలు చెల్లవు అని అంటున్నారు. అంటే, ఇప్పుడు బిల్లు ప్రవేశపెట్టి, సెలక్ట్ కమిటీకి పంపి, దేశం అంతా తిరిగి మళ్లీ అసెంబ్లీలోకి వచ్చి పాస్ చేసిన తర్వాత, కొన్ని లాండ్ కమీషన్లో, ఉద్యోగస్థులో యీ భూముల యొక్క ఆదాయాన్ని బట్టి ఎక్కడ ఎంత భూమి ఉంటుందన్నది పరిశీలనలు జరిపిన తర్వాత "నీకు ఉన్న భూమి లెక్క చెప్పాలి" అని రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్‌గారు నోటిఫై చేస్తారు. అప్పుడు దాకా ఆ భూములు అమ్ముకొనేదానికి అవకాశం ఉన్నది. అప్పటిదాకా మనం అమ్ముకొనేదానికి అవకాశం ఇచ్చినప్పుడు, ఏమాత్రం పనికిరాని భూమిని, ప్రభుత్వం నుండి కాంపెన్‌సేషన్ తీసుకొంటే లాభంగా ఉంటుంది అనుకొనే భూమిని అమ్ముకోకుండా అట్టేపెట్టుకొంటారు గాని, తమకు ఒక రూపాయి నష్టం వచ్చే భూమిని, ప్రభుత్వం తీసుకొనేందుకు వీలుగా ఎవరైనా అమ్ముకోకుండా ఉంచుకొంటారా? "ఇదిగో, మేము బిల్లు ప్రకటించాము; 72 వేల రూపాయల వరకు ఆదాయం వచ్చే భూమిని ఉంచుకోవచ్చును, అంతకు మించి భూమి ఉంటే తీసుకొంటాము; రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్‌గారు తర్వాత డేట్ నోటిఫై చేస్తారు; ఆ డేట్ తర్వాత మీకు భూములు అమ్ముకోటానికి వీలుండదు" అని స్పష్టంగా ప్రకటించిన తర్వాత, ఎవరైనా భూములు అమ్ముకోకుండా ఉంటారా? మంత్రిగారు లక్ష ఎకరాలు వస్తుంది అని అన్నారు. కాంపెన్‌సేషన్ తీసుకోవటం వల్ల లాభం వచ్చే భూములు, లక్ష ఎకరాలు రావాలిగాని, సాగుకు వీలైన మంచి భూమి లక్ష ఎకరాలు వదులుకోటానికి మన ఆంధ్రరాష్ట్రంలో ఎంతమంది సిద్ధంగా ఉంటారని అడుగుతున్నాను. నోటిఫైడ్ డేట్ దాకా భూములు అమ్ముకొనేదానికి అవకాశం ఉన్నదని చెప్పటం వల్ల, యీ బిల్లు భూస్వాములకు ఇంకా లాభకరంగా ఉండేదానికి తోడ్పడుతుంది. ఏవిధంగాను సాగుకాకుండా, శిస్తులకుకూడ చెల్లకుండా ఉండే భూములకు భూస్వాములు ప్రభుత్వంనుండి నష్టపరిహారం తీసుకొనేదానికే యీ బిల్లు ప్రవేశపెట్టారని అనుకోవలసి వస్తున్నది. జాతి ప్రయోజనాలకోసం, రైతుప్రయోజనాల కోసం మనం భూసంస్కరణలు చేయాలంటున్నాము. కాని యీ బిల్లు అందుకు ఏమాత్రం ఉపయోగపడదు. "మేము రైతులను దృష్టిలో పెట్టుకొని మాట్లాడుతున్నాము; కొంతమంది రైతులకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నారు" అని చెబుతున్నారు. ఇది వాస్తవమైన విషయం కాదు. 50 ఎకరాలు ఉన్నవారు 37 వేలకన్నా జాస్తిలేరు. తక్కిన రైతు కుటుంబాలు 40, 50 లక్షలదాకా ఉన్నవి. మేము యీ లక్ష కుటుంబాల రైతులను దృష్టిలో పెట్టుకొని మాట్లాడుతున్నాము. కేవలం ఒక పర్సెంటు ఉన్న పెద్దపెద్ద భూస్వాముల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని మాట్లాడి, లక్షలాది రైతుల ప్రయోజనాలకు భంగం కలిగేరీతిగా మనం

వ్యవహారం చేయకూడదు కాబట్టి, రైతులకు, భూమి మీద పనిచేసే రైతులకు మేలు కలిగేవిధంగా యీ బిల్లును మార్చి, పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు లాభం కలిగి, న్యాయంగా ఉండేటట్లుగా దీనిని సవరించాలని కోరుతున్నాను.

శ్రీ ఎ. బాపినీడు (కొవ్వూరు) :— అధ్యక్షా, చాలాకాలం నుంచి అను కుంటున్నటువంటి యీ భూసంస్కరణల బిల్లును యీ రోజున రెవిన్యూ మంత్రిగారు శాసనసభ ముందు ఉంచటం చాలా అభినందించవలసిన విషయము. అయితే, మొట్టమొదటినుంచి, మన నాయకులు, ముఖ్యమంత్రిగారు, మిగతా మంత్రులు అధికాహారోత్పత్తి చేయాలని, ఆహారధాన్యాల ఉత్పత్తిని పెంచాలని పదేపదే చెబుతున్నారు. "అధికాహారోత్పత్తి సాధించటానికి భూసంస్కరణలు చేయటము అవసరము. భూమిమీద ఎక్కువ ఉత్పత్తి తీసుకువచ్చి, అధికాహారోత్పత్తి సాధించినపుడు, మనము ఇతర రాష్ట్రాల నుండి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవలసిన అవసరం ఉండదు" అని మన ప్లానింగ్ కమిటీవారు పదేపదే చెబుతున్నారు. ఈ భూమి ఒకరి చేతిలో ఉండటం వల్ల ఉత్పత్తి సరిగా జరగటం లేదు, సూపర్‌విజన్ సరిగా జరగటంలేదు అన్న విషయాన్ని దృష్టిలో పెట్టుకుని యీ బిల్లు తీసుకువచ్చారు. ఇప్పుడు, భూమికి ఒక పరిమితి పెట్టి, దానిమీద ఆదాయానికి పరిమితి పెడుతున్నారు. భూమిమీద వచ్చే ఆదాయానికి పరిమితి పెట్టటం తోటి యీ సమస్య పరిష్కారం అవుతుందన్నది చాలా సందేహమైన విషయము. ఇతర రాష్ట్రాలలో పెట్టినట్లుగా, భూమికి ఒకటవ రేటు, రెండవ రేటు, మూడవ రేటు, అనిపెట్టి. 50 ఎకరాలో, 60 ఎకరాలో, పంద ఎకరాలో, పది ఎకరాలో, ఆ మాదిరిగా పెట్టినట్లయితే బాగుంటుందని నేను మనవి చేస్తున్నాను. మన కమ్యూనిస్టు సోదరులు చెప్పినట్లు ఆహారధాన్యాల ధరలు పెరిగి పోతున్నాయి. ధరలు పెరిగిపోతున్నాయనే విషయాన్ని మనం పదేపదే ఆలోచిస్తున్నాము. కేంద్ర ప్రభుత్వంగాని, రాష్ట్ర ప్రభుత్వంగాని, ధాన్యానికి కనీస ధరలను నిర్ణయించలేదు. కనీస ధరలు నిర్ణయించి, ధరల విషయంలో మనకు గ్యారంటీ ఇవ్వలేదు. పొగాకుకుగాని, మిర్చికిగాని, వేరుసెనగకుగాని, ఇంతకంటే ధర తగ్గనీయము, అని కనీస ధరకు గ్యారంటీఇచ్చి, అది షెడ్యూల్‌లో చేర్చండి అది షెడ్యూల్‌లో చేర్చి, "ధాన్యం బస్తాకు ఇంత ధర కడుతున్నాము. వేరుసెనగ బస్తాకు ఇంతధర కడుతున్నాము, మిర్చికి ఇంతధర కడుతున్నాము, పొగాకుకు ఇంత కడుతున్నాము" అనేటటువంటి గ్యారంటీ ప్రభుత్వం ఇచ్చినట్లయితే, 5,400 రూపాయలను మేక్సిమమ్‌గా నిర్ణయించటం సమంజసము అవుతుంది. అయితే ఇప్పుడు ఆ విధంగా చేయటం లేదు.

వర్షాలులేక, నీటిపారుదలలేక, నీటి సప్లయి కొరకు ఎక్కువగ బాధపడుతున్నటువంటి మెట్టప్రాంతాలలో సీలింగును నిర్ణయించడము చాలా కష్టము. అది ఆర్. డి. ఓ. కానివ్వండి, కలెక్టరు కానివ్వండి, అధికారులే నిర్ణయించడము అంటే చాలా కష్టతరమైనటువంటి విషయము. ఒకవేళ అధికారులు నిర్ణయించడమైనా, అది అనుమానాస్పదమైన నిర్ణయమే అవుతుంది. కాబట్టి రెవిన్యూమంత్రిగారికి నేను చెప్పదలచుకున్నది ఏమిటంటే, యిది ఒక తరములో జరిగిన విషయముకాదు. తెలంగాణా ప్రాంతములో ఏదో ఒక విధముగ నిర్ణయముచేసి ఉండవచ్చు. పాత ఆంధ్రరాష్ట్రంలో ఉన్న పరిస్థితి రెవిన్యూమంత్రిగారికి తెలిసినటువంటిదే. వారికి ఆంధ్రప్రాంతంలో ప్రతివిషయము తెలియకపోలేదు. వారికి ప్రతిజిల్లావిషయముగాని, తాలూకా విషయముగాని, ఆఖరుకు ప్రతి గ్రామములోగాని పరిస్థితికూడా తెలుసు. ఈ విధముగ **5400, 3600** అని కాకుండా ఒక్కొక్క గ్రామానికి యిన్ని ఎకరములని fix చేయడమో, గోదావరి డెల్టా క్రింద యింత అని, కృష్ణా డెల్టా క్రింద యింత అని భూమిని fix చేయడమో, యీ చెరువుక్రింద యింత అని, మెట్ట తాలూకాలలో యింత అని, యీ విధముగ fix చేయడమో, ఈ విధముగ fixation జరిగితే బాగాఉంటుందేమోనని అనుకుంటాను. తరువాత Land Reform ప్రవేశపెట్టుతున్నాము అని పదేపదే చెబుతున్నారు. భూసంస్కరణలద్వారా భూమి లేని వారికి భూమిని పంచుతాము అని చెప్పడము సరియైన పద్ధతి కాదు. ఆ విధముగ పంచితేమట్టుకు ఉత్పత్తి ఎక్కువ చేయగలరా? చైనాలోగాని, జపాన్‌లోగాని చేసినట్లుగా యిక్కడ మనముకూడా చేయటానికి ప్రయత్నిస్తే, అక్కడ ఉన్న సదుపాయములు ప్రభుత్వం మనదేశంలో చేయగలదా? పొగాకు మన దేశంలో ఎంతో ఎక్కువ ఉత్పత్తి చేస్తున్నారు. పండించిన పంట అంతా తగిన ధర లేకపోవడమువల్ల, రైతులవద్దనే నిలిచిపోయి ఉన్నది. మిర్చికికూడా ధర లేదు. ఈ పంటలను విదేశాలకు ఎగుమతిచేసి ఎక్కువ ధర రాబట్టటానికైనా ప్రభుత్వము ప్రయత్నించిందా అంటే, అది ఏమీలేదు. బెంగాల్ రాష్ట్రములోను, యితర రాష్ట్రాలలోనూ, Australia నుంచి మనము దిగుమతి చేసుకుంటే ఉండే ధర అయినా మన రాష్ట్రములో ఎందువల్ల ఉండకూడదు? ఈ విషయమును మనము కేంద్రప్రభుత్వానికి ఎన్నోవిధములుగ చెబుతూ వస్తున్నాము. ఇక్కడ అసెంబ్లీలో కూడా చెప్పడము జరుగుతున్నది. ధాన్యాలకు పండించినంతవరకైనా సరియైన గిట్టుబాటు ధర లేకుండా ఉన్నందువల్ల రైతుల ఆర్థికపరిస్థితి మరింత క్లిష్టతరమవుతున్నదని రైతులు గోలపెట్టుతున్నారని యిక్కడ అసెంబ్లీలో పదేపదే చెబుతున్నప్పటికినీ ప్రభుత్వం యీ విషయాన్ని గురించి ఆలోచించినట్లు లేదు. భూఆదాయము మీదనే సీలింగు పెట్టుతామని ప్రభుత్వం చెబుతూఉంటే, అట్లాకాదు, యితర ఆదాయముల మీద కూడా సీలింగు పెట్టండి అని యిప్పటికి రెండు సంవత్సరములుగా

చెబుతూ ఉంటే, యీ విషయమును గురించి ప్రభుత్వం ఆలోచించకుండా భూఆదాయమునకు సీలింగు ఏర్పాటు చేస్తామని బిల్లు తెచ్చారు. అన్నింటి మీద సీలింగు ఎందువల్ల పెట్టకూడదు? ఒక్క భూఆదాయము మీదానే ఆధారపడి అతికష్టముతో జీవితము గడిపే యీ రైతుకే యిలాంటి పరిస్థితి ఎందువల్ల రావాలి? సరే 5400 రూపాయలనే ఎందువల్ల fix చేస్తున్నారు? అలాగైతే నెల ఒకటింటికి మూడువేలు, నాలుగు వేలు, అయిదువేలు జీతాలు తెచ్చుకుంటున్న ఉద్యోగస్థులకు మాత్రము ఎందువల్ల పెట్టకూడదు? ఆలాంటి పెద్దపెద్ద ఉద్యోగస్తులకు కూడా 500 రూపాయలు జీతాలు యివ్వండి. ఉద్యోగస్థులందరికీ 500 రూపాయలకు సీలింగు పెట్టితే, రైతులకు కూడా పెట్టవచ్చు; అప్పుడు రైతుకు కూడా ఎలాంటి అభ్యంతరము ఉండదు. "మీరుముందు reform కండి. అవశ్యపూర్వకముగా ముందు మీరు ఆచరణలో పెట్టిచూపించండి" అని పండిట్ నెహ్రూగారే చెబుతూ ఉంటే, ఒక్క రైతువిషయములోనే యీ మహానుభావులు యిలాంటి వివాదాలు ఎందువల్ల చేస్తున్నారని ప్రశ్నిస్తున్నాను ఇక్కడ సభలో కూర్చున్నటువంటి గౌరవసభ్యులు ఒక్కొక్కరు నెలకు నూటయాభై రూపాయల జీతము, దినమునకు ఖర్చు రూ॥ 12-8-0 లు పుచ్చుకుంటున్నారు. ఈ పని యుగ తీసుకునేవారికి ఎంతెంత ఆదాయము వస్తున్నది, ఎంత ఖర్చు చేస్తున్నాము అనే విషయము కూడా ఆలోచించినట్లుగా లేదు. ఇదిగో నేను [illegible] 150 రూపాయలకంటే ఎక్కువ తీసుకోను, 300 లు ఎంతో ఎక్కువ తీసుకోను అని ముందుకువచ్చి చెబుతూ, అది ఆచరణలో పెట్టిన తరువాత, యిదుగో నీభూమి మీద ఆదాయము ఎంత, ఆ ఆదాయమునంతా ఏమిచేస్తున్నావు, ఇట్లా చేస్తే దేశమునకు నష్టము వస్తున్నది. నీ భూమిని యింతవరకు ఉంచుకో అని చెబితే, అప్పుడు అది రైతుకూడా అవలంబించడానికి అభ్యంతరము ఉండదు. అటువంటి విధానము అవలంబించటానికి నూటికి 80 మంది రైతులు ముందుకు వస్తారు. అంతేకాని రైతులు ఏదో లాభము పొందుతున్నారని వివాదాలు చేయడము మంచిది కాదు. రైతు కష్టనిష్ఠూరాలు ఏవిధముగాను గుర్తించకుండా యిలాంటి వివాదములు చేయడము మంచిదికాదు. పంచాయతి సంఘములని గ్రామాలలో రైతుల కొరకు ఏర్పాటుచేశారు కాని, అవి నిజముగ ప్రతిరైతునకుగూడ అందుబాటులో లేవు. వారికి కావలసిన వసతి అమనుకు పొందడము లేదు. ఆ వసతి, వారికి అందుబాటులో లేదు. రైతులు పండించే పంటల Marketing Societies ద్వారా యితర రాష్ట్రాలకు అందిస్తామన్న విషయము యీ బిల్లులో లేదు. 5,400 రూపాయలు కాదు. 3600 ల రూపాయలు పెట్టండి. నా కేమీ అభ్యంతరము ఉండదు. ఇందులో రైతుకు పోయేది ఏమీలేదు. రైతు ఏరోజు అయినా కష్టపడి పంటను పండించి జీవించ గలుగుతాడు. ఎంత తక్కువ భూమి ఉన్నను దానిమీదనే ఆధారపడి తగినంత పంట పండించగలడు. భూమిని నమ్ముకున్న రైతు 20 వేల రూపాయలు

అయినా పంటమీద సంపాదించగల్గుతాడు. ఇప్పుడు వెంకటరావుగారు పెట్టిన 36 ఎకరములు fix చేస్తామని అంటున్నారు. ఆ భూమిలోనే ఎకరమునకు 50 బస్తాల చొప్పున పండించగలడు కాని దానికి తగిన సౌకర్యములు చేయండి. అప్పుడు రైతుకు దిగులు అనేది ఉండదు. అభ్యంతరము అంతకంటే ఉండదు. భూమిమీద ఆధారపడి జీవించే రైతు ఎప్పుడూ చెడిపోడు. 3600 రూపాయల సీలింగు పెట్టినను కష్టపడి పంట పండించే రైతుకు తిండి ఉంటుంది. భూమిమీద జీవించడమనేది రైతుకు తరతరాలుగా వస్తున్నది. ఈ కాంగ్రెసు ప్రభుత్వము ఉన్నప్పుడేకాదు, మరి ఏ యితర ప్రభుత్వము వచ్చినా, కమ్యూనిస్టు ప్రభుత్వం వచ్చినా, భూమిమీద ఆధారపడి జీవించే రైతు జీవించగలడని మాత్రము గుర్తించండి.కాని అతడు పండించే పంటకు మాత్రము గిట్టుబాటు ధర ఉండాలి. భూమిని దున్ని ఎవరైతే ఎకరమునో పది బస్తాలు పండించి, ఆరు బస్తాలు భూఖామందుకు యిచ్చి తాను మిగిలిన నాలుగు బస్తాలు తింటాడో, వాడే వర్కరు అనిపించుకోగలడు. అయితే ధరలను నిర్ణయించడమనేది కష్టమైన విషయము. అయితే ముఖ్యంగా వెంకటరావుగారే రెవిన్యూ మంత్రిగా ఉండి యిలాంటి బిల్లును తీసుకుని రావడమనేది చాలా దురదృష్టకరమైన విషయము. కొంతమంది మిత్రులు యిది అంతా మేడిపండులాగా ఉన్నదని చెబుతున్నారు. గ్రామ సీమలలో రైతాంగము నూటికి 80 మంది ఉంటున్నారు. భూమిని దున్ని పంటలు పండిస్తున్నారు. దేశముయొక్క బ్రతుకే వీరిమీద ఆధారపడి ఉన్నదన్న సంగతి ఎవరు మరచిపోకూడదు. అయితే వీరికి కావలసిన సౌకర్యాలు ఏమైనాకలిగిస్తున్నదా యీ ప్రభుత్వం? రైతులవల్ల ఎన్నుకోబడి, యిక్కడికి వచ్చి కూర్చున్న శాసనసభ్యులు యిక్కడవాళ్ళకు ఏవిధమైన సౌకర్యాలు కలుగజేయ గలుగుతున్నారని ఆలోచిస్తే, అవి ఏమీకన్పించవు. వారు చేస్తున్నదల్లా మాపట్టణములో water supply లేదు, విద్యుచ్ఛక్తి లేదు, మాకు మురుగుకాలువలు లేవు, కాలేజీలులేవు, hostels లేవుఅని చెప్పడము తప్ప. రైతుల పరిస్థితిని బాగుపరచే నినాదాలు ఏమీ చేయడము లేదు. ఈ విషయము ప్రజలుగాని, రైతులుగాని గ్రహించలేని పరిస్థితిలో ఉన్నారని మాత్రము భావించ కూడదు. రైతుకు 5,400రూపాయల వరకు నికరాదాయము ఉండాలని, అంతవరకు సీలింగు పెట్టుతున్నామని ప్రభుత్వం చెబుతున్నది. అయితే వేలాది ఎకరములు ఉన్న వారి పరిస్థితి ఏమిటి? ఇక్కడ సభలో నూటికి 80 మంది రైతు కుటుంబంలో పుట్టిన వారే ఉన్నారు. ఇలాంటి వారందరికీ గ్రామసీమలలో ఎకరము, అర ఎకరము, రెండు, మూడు ఎకరాలు గలిగి ఉన్న పేదరైతులే ఓటు యిచ్చారన్న సంగతి మరవకూడదు. గ్రామసీమలలో రైతు కష్టపడి పండించిన బస్తా ధాన్యమును పొట్ట ఆత్రము కొరకు తక్కువ ఖరీదుకు అమ్ముకుంటే, ఆ ధాన్యము కొనుక్కునివచ్చి, పట్టణవాసాలలో కూర్చుని హెచ్చుధరలకు అమ్ముకుని లాభము పొందుతున్న మహానుభావులు ఎంతో

మంది ఉన్నారు. వది మిల్లర్సు కానివ్వండి. వర్తక వర్గముల వారు కానివ్వండి. పారిశ్రామికులు కానివ్వండి, ఉద్యోగస్థులు కానివ్వండి హెచ్చుధరలకు కొనుక్కో వలసి వస్తున్నది. తక్కువ ఖరీదుకు అమ్ముకోవలసి వచ్చిన రైతు నష్టపడు తున్నాడు. హెచ్చుధరలకు అమ్ముకుని లాభము పొందుతున్నవారు లాభము గడించి పట్టణవాసములలో మిద్దెలు, మేడలు కట్టుకుని కూర్చుంటున్నారు. కాని రైతు ఆ విధముగ గ్రామాలలో మిద్దెలు, మేడలు కట్టుకుని కూర్చోవడము లేదు. ఈరోజున గ్రామసీమలలో రైతు పరిస్థితి చూడండి. భవనములు ఉన్నవో పూరిళ్ళు వున్నవో చూడండి. ఆ గ్రామాలకు రహదారులు విద్య, వైద్య సౌకర్యాలు కలిగిస్తున్నారా? ప్రభుత్వము భూసంస్కరణల ప్రచారం ఆరంభించుటకు ముందువరకు కౌలుదారు మధ్య గాని, రైతు అనగా భూస్వామి మధ్య గాని, కూలీల మధ్య గాని, ఎలాంటి భేదాభిప్రాయములు లేకుండా ఏకీభావముతోనే ఉన్నారు. భూసంస్కరణల విషయము వచ్చినప్పటికినీ వారి యిద్దరిమధ్య ఏకీ భావము భిన్నము కాలేదు. ఇది తరతరాలనుంచి వస్తున్న విధానము. చిన్నచిన్న extents అనగా నాలుగు అయిదు ఎకరాలు ఉన్న ఉద్యోగస్థులు మొదలుకొని గ్రామసీమలలో రైతు లేని పంటలు పండిస్తున్నారు. ముఖ్య మంత్రిగారు కూడ రైతు కుటుంబములోనుంచి వచ్చినవారే. గ్రామములలో రైతు యొక్క పరిస్థితి వారికి తెలియకపోలేదు. గ్రామసీమలలో రైతులు పంటలుపండించ టానికి పడే కష్టములను గురించి సుబ్బారావుగారు చెప్పారు. గత అయిదు సంవత్స రములలోను రెండు సంవత్సరములు వారి ప్రాంతములో కరవు వచ్చిందని అన్నారు. డెల్టా ఏరియాలలో ఏదో కొద్ది తాలూకాలలో తప్ప తక్కిన చోట్లలో పేద రైతులు చాలామంది బాధపడుతున్నారు. గడచిన కొద్దిసంవత్సరములలో రైతుకువచ్చిన ఆదా యము, ఖర్చు, మిగులు ఎంతో, లెక్కచూస్తే నిజపరిస్థితి తెలుస్తుంది. భూమిమీద ఆధారపడి పంటలు పండించి జీవించే రైతు యీ రోజులలో అప్పులలో మునిగి ఉన్నాడు. అతని ఆర్థిక పరిస్థితి ఎంతో క్లిష్టముగా ఉంటున్నది. ఎవరో, ఎక్కడో షుగర్ ఫ్యాక్టరీ పెట్టుకున్నవారు నాగా ఉండే ఉండవచ్చు. ఇదిగాక absen-tee landlordsను గురించి చెబుతున్నారు. అయితే absentee land lords అనేవారు ఎవరు? ఎవరో కొంతమంది ఉద్యోగస్థులు, నాలుగు, అయిదు ఒకటి అర ఎకరములు గలవారు ఉంటే, వారికి ఆ భూమిమీద ఆదాయము చాలక ఉద్యోగాలకు పోయి ఉన్నవారు కావచ్చు. వారికి పది, అయిదు, బస్తాలు వస్తూండే వారికి ఆ ఆదాయము సరిపోతుందా? పట్టణవాసములలో హెచ్చుగా అన్ని సౌకర్య ములు అనుభవిస్తున్న వారికి యీ చిన్న చిన్న జీతాలు ఆదాయము వస్తున్న వారి యొక్క పరిస్థితి ఏమి తెలుస్తుంది? ఆ విధముగ అనుభవము లేకుండా చెప్పడము వలన ఏమి ప్రయోజనము? అందువలన యీ బిల్లును నేను పూర్తిగా support

చేయుచున్నప్పటికిని, నేను మంత్రిగారికి మాత్రము ఒక్క విషయము చెప్పదలచు కున్నాను. దరల విషయములోను, ప్లానింగు విషయములోను వెంకట్రావుగారు న్యాయముచేస్తారని ఆశించుచున్నాను

తరువాత మామిడి తోటల విషయము చెబుతున్నారు. మామిడి తోటలు, బత్తాయి, నిమ్మ, నారింజ వగైరా తోటలు ఎంతకష్టపడి పెంచుతున్నారనేది మనకు అక్కరలేదు. అటుంచండి. కాని ప్రభుత్వమువారు ఉత్పత్తి కావాలి, దేశము బ్రతకాలి అంటున్నారు. ఉత్పత్తి ఎక్కువగా కావాలంటే మనము విదేశాలనుంచి ధాన్యము దిగుమతి చేసుకోనవసరము లేకుండా చేయాలి. ఎండనక, వాననక, రైతులు కష్టపడి తోటలు పెంచి, fruits ను ఉత్పత్తి చేస్తున్నారు. ఒక్కొక్క చోట ఎకరానికి అయిదు, పది రూపాయలు అయినా రానటువంటి ప్రదేశాలలో ఏదో తోటలు అయినా పెంచి పండ్లు, ఫలములు పండిస్తున్నారు. ఇది అంతా ఎవరి కోసము ? ఇది అంతా దేశముకోసమే. ఉద్యోగస్థులు ఏదో జీతము తెచ్చుకుంటు న్నారంటే అందులో చిన్న చిన్న జీతాలవారికి వచ్చే జీతాలు వాస్తవముగా చాలక బాధపడుతున్నారు. అక్కడ రైతులకు ఎక్కువపంట పండుతున్నది. కార్లలోను విమానాలలోను తిరుగుతున్నారని అపోహ పడక, వారికి కావలసిన సదుపాయ ములు చేయండి గ్రామ సీమలలో ఉన్న రైతాంగము యొక్క ఆర్థిక పరిస్థితిని యిక్కడ ఉన్న M. L. A లకు, మంత్రులకు అందరికి తెలుసును గనుక వారి యొక్క కష్టములను దృష్టిలో పెట్టుకుని సెలెక్టు కమిటీలో రైతులకు అన్యాయము జరుగకుండా చేస్తారని, ముఖ్యమంత్రిగారు, రెవిన్యూమంత్రిగారు యీ విషయము జ్ఞాపకము ఉంచుకుంటారని ఆశిస్తూ, యింతటితో విరమిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ — సభ రేపు ఉదయము గం 8-30 ని॥ల వరకు వాయిదా వేయుచున్నాను.

*(The House then adjourned till Half-Past Eight of the Clock on Wednesday the 20th August, 1958)*